స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం ప్రచురణ సంఖ్య : 7

ప్రతులు . 1200

ముద్రణ : 1992

రచన :

మల్లాది సుబ్బమ్మ



ప్రచురణకర్త :

స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం,

9, ఎం.ఐ.జి హెచ్. కాలనీ, మెహిదీపట్నం, హైదరాబాద్-500 028.

ఇందులో...

* స్వాతంత్ర్యానంతర స్త్రీల చైతన్యం : భవిష్యద్దర్శనం
* జాతీయ సమైక్యత
* లైంగిక విప్లవం

వెల : రూ. 15-00

ప్రతులకు :

స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం,

9, ఎం ఐ.జి.హెచ్ కాలనీ, మెహిదీపట్నం, హైదరాబాద్-500 028.

ఫోన్లు : 35429, ఆఫీస్ : 220156.

ముద్రణ :

[redacted]



# స్త్రీలపై పీడనను ఖండించాలి

ఇటీవల స్త్రీల వేధింపు కేసులు ఎక్కువవుతున్నాయి. ముఖ్యంగా ఇది యవ్వన వంతులైన స్త్రీలపట్ల జరుగుతున్న అపచారం. స్త్రీలను ఎగతాళి చేయడం, వారిని గురించి అసభ్యకరంగా వ్యాఖ్యానాలు చేసి బాధించడం ఈ నేరం యొక్క ప్రధాన లక్ష్యం. అలా ప్రవర్తించేవారి సంఖ్య రోజురోజుకీ పెరుగుతుంది. ఆమెను భోగ్య వస్తువుగా చూడటం వలననే ఇటువంటి అకృత్యాలకు గడంగుతున్నారు. ఈ ఆకతాయి మనుషులకు కూడా తల్లులు, చెల్లెళ్ళు వున్నారు. మరి వారి పట్ల గౌరవ భావం చూపే వ్యక్తి ఇలా ప్రవర్తించడానికి కారణమేమిటి? వారిలో అజ్ఞానం విరివిగా వుండటమే వారు ఇలా ప్రవర్తించడానికి ఊతమిస్తున్నది. అటువంటి సన్నివేశాలలో స్త్రీలు అతిగా లజ్జను ప్రదర్శించడం కూడా ఆ స్త్రీలు ఈ రకమైన వేధింపుకు సమ్మతిస్తున్నారని నిందితుడు భావించడానికి వీలు కలుగుతుంది. కనుక ఆ యువతులు దుండగులను ఖాతరు చేయకపోవడమో లేక పోలీసులకు రిపోర్టు ఇవ్వడమో చేయాలి. అప్పుడే ఈ ఆగడాలు సమసిపోతాయి.

## మానభంగాలు, చిత్రహింసలు :-

రెండు ముఠాల పురుషులు తగాదాపడితే ఒక ముఠాలోని పురుషుడు రెండవ ముఠాలోని పురుషుల భార్యలను, అక్కచెల్లెళ్లను, తల్లులను అవమానపరచి హింసించడం అలవాటయింది. అదీగాక ఆడకూలీలను పోరాటమార్గాన్నుండి తప్పించడానికి యజమానులు, భూస్వాములు కిరాయిగుండాలచేత స్త్రీలను మానభంగాలకు లోనుచేయడం కూడా సాగుతున్నది. అంతేగాక కుటుంబంలో భర్తలు భార్యలను దండించే పద్ధతిలో ఈ దుర్మార్గాలను చేపడుతున్నారు. ఉదాహరణకు భార్య వ్యభిచారిణి అని భర్తకు అనుమానం కలిగితే ఆమె జుట్టు గొరిగించడం, ఆమెపై ప్రమాదకరమైన ద్రవపదార్థాలను (acids) పోయడం, ఆమెను ఇతరులచేత మానభంగాన్ని చేయించడం లేకపోతే ఆమెను చంపివేయడం కూడా జరుగుతుంది. ఈ కేసులన్నింటిలో ఒకేరకపు భావన నిందితుల ఊహలలో స్థిరంగా నాటుకున్నది. స్త్రీ పురుషుడి సొత్తు అని భావించి ఆమె శీలాన్ని దోచుకోవడం ఎదుటివాడి ఆస్తికి నష్టం కలిగించే చర్యకు నిందితుడు పూనుకుంటున్నాడు. అలాగే కొంతమంది భర్తలు కూడా ఆమెను హింసించే ప్రక్రియలను చేపట్టడంలో ఆ భావనకు లోనవుతున్నారు. కేవలం కాముక భావనకులోనై నిందితుడు స్త్రీని మానభంగం చేసే దుర్మార్గ చర్యకు పూనుకున్న సంఘటనలు అతిస్వల్ప సంఖ్యలో వున్నాయి. చాలా కేసులలో ఆమె బంధువులు ఆమె కుటుంబ స్నేహితులు ఈ దుష్టత్వానికి కారకులవుతున్నారు. మానభంగానికి లోనైన

స్త్రీ ఈ అవమానాన్ని భరించలేక కుమిలిపోతోంది. తను శీలాన్ని పోగొట్టుకున్నట్లు బాధ పడుతుంది. అవమానాన్ని భరించలేక కొందరు స్త్రీలు ప్రాణత్యాగం చేస్తున్నారు. మున్ముందుగా ఈ శీలాన్ని గురించి అత్యాచారాలకు గురైన స్త్రీలకు తెలియజెప్పాలి. శీలమంటే కేవలం లైంగిక దృష్ట్యా చూడరాదు. చేతికి, కాలుకు దెబ్బతగిలితే చనిపోవడానికి మనం సిద్ధంకావడం లేదుకదా అలాంటప్పుడు మరో అవయవానికి ఘాత్త కలిగితే ఎందుకు ప్రాణత్యాగానికి సిద్ధపడాలి? ఆమాటకొస్తే ఆమె మీద బలవంతపు దౌర్జన్యం జరిగినప్పుడు ఆమె ప్రమేయం లేదుకదా? నిందితుడి చర్యలో తన సమ్మతి లేదుకనుక ఆమె దోషికాదు. ఈ విషయాన్ని ఆమెకు విశదంగా చెప్పడం కాస్తయినా చైతన్యంగల స్త్రీల బాధ్యత.

ఇలాంటి కేసుల్లో నిందితులకు దుర్మార్గపు ఆలోచన కలగడానికి కారణం సమాజం పట్టించుకోకపోవడం వల్లనే సంభవిస్తున్నది. ఎవరికి వారు తమ మీద అపచారం జరిగినప్పుడు ఆందోళన చేస్తారు. అదే పరాయివారి పట్ల జరిగితే "మనకెందుకు" అని ఊరుకుంటారు. సామాజిక ప్రబోధం మాత్రమే ఈ పరిస్థితిని మార్చగలదు.

వరకట్న మరణాలు, ఇటీవల పెరుగుతున్నాయి. ఆధునిక సమాజంలో డబ్బుమీద, ఆధునిక సౌకర్యాల మీద మోజు పెరిగి అదనపు కట్నం తేలేని భార్యలను తగులబెట్టి చంపుతున్నారు క్రూరులైన భర్తలు. ఈ భార్య చస్తే మరో భార్యను పొందగలమనే ధైర్యంతో వారు అలా ప్రవర్తిస్తున్నారు. మంటల్లో కాలుతున్న స్త్రీ కేకలను, హాహాకారాలను విన్న ఇరుగుపొరుగువారు పోలీసువారి ఎదుట, న్యాయస్థానాలలో, సాక్ష్యమివ్వడానికి విముఖులవుతున్నారు. అందువల్ల చాలా నేరాల్లో భర్తలకు శిక్షలు పడటంలేదు. ఈ పరిస్థితి మారాలంటే ఇరుగుపొరుగువారు సాక్ష్యాలు చెప్పి పోలీసులకు, న్యాయమూర్తులకు మద్దతుఇవ్వాలి. ఈ దుర్మార్గాల పట్ల అసహనం పెచ్చుపెరగాలి. దీనికి ప్రజాప్రబోధం అవసరం అవుతుంది అప్పుడే ఈ సమస్యకు న్యాయమైన పరిష్కారం లభిస్తుంది.

ఈ ప్రబోధం సాగించడానికే సమాజంలో జరిగే అత్యాచారాలకు చైతన్యం కల స్త్రీ పురుషులు స్పందించి అరికట్టడానికి చర్యలను తీసుకున్ననాడే ఈ నేరాలు తగ్గిపోతాయి; లేకుండా పోతాయి. స్పందించడం మానవ వ్యక్తియొక్క ప్రత్యేక లక్షణం. స్పందన భావవిప్లవం, సమాజ భద్రతకు చర్యలను చేపట్టడం ముఖ్యంగా జరగవలసిన పని. ఈ రోజు పరాయివాడి ఇంట్లో ఈ దుర్మార్గం జరుగుతుంది. రేపు మన ఇంట్లోకూడా సంభవించవచ్చు అనే జ్ఞానాన్ని అందరము సంతరించుకున్నప్పుడు ఈ అత్యాచారాలు నశిస్తాయి. దానికి మనం నడుంకట్టాలి.

మల్లాది సుబ్బమ్మ

డైరెక్టర్

స్త్రీల హక్కుల రక్షణ కేంద్రము



# స్వాతంత్ర్యోద్యమ పోరాటంలో
# స్త్రీల అనుభవాలు జ్ఞాపకాలు

బ్రిటీష్‌వారితో స్వాతంత్ర్యోద్యమ పోరాటం అనేక స్వేచ్ఛా రూపాల ఆధారంగా జరిగింది. ఆకలినుండి, భయంనుండి, దోపిడీనుండి, అధికారంనుండి, అణచివేత నుండి విముక్తి కొరకు ఆ భయంకర పోరాటం జరిగింది. బానిసలకు, బానిసలుగా వున్న స్త్రీలుసైతం తమ దేశ బంధవిముక్తికి, తర్వాత తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరకు అశేష త్యాగాలు చేశారు. అశేష భారత ప్రజానీకం సమానమైన హక్కులు పొందాలనేదే ఆనాటి మహిళల ఆక్రందన. తమ భర్తలను, బిడ్డలను దేశవిముక్తి పోరాటానికి కొండంత ధైర్యాన్ని ఇచ్చి పంపారు. మహాత్మాగాంధీ ట్రిబుల్ బాయికాట్ పిలుపు ఇచ్చినప్పుడుగాని, వ్యక్తి సత్యాగ్రహానికి గాని, ఉప్పు సత్యాగ్రహానికి గాని, ఊరేగింపులకు, ప్రదర్శనలకు గాని, క్విట్ ఇండియా ఉద్యమానికిగాని పురుషులతో పాటు స్త్రీలు నాలుగుగోడలు దాటి బైటికొచ్చారు. త్యాగాలుచేశారు. విదేశీ వస్త్రదహనం చేశారు. రాట్నం వడికి నూలు తీశారు. విదేశీ వస్తువులపై నిషేధం చూపారు. జైళ్ళు కెళ్ళారు. కొందరు చనిపోయారు. మరికొందరు వ్యాధిగ్రస్తులయినారు. జైళ్ళలో పురుళ్ళుపోసుకున్నవారు కూడా వున్నారు. స్వాతంత్ర్యానంతరం సమాన హక్కులు వస్తాయని ఆనాటి మహిళలు కలలు కన్నారు. అందుకొరకే భయంకరమైన బాధ్యతలు స్వీకరించటానికి వారు ఏనాడూ వెనుకాడి ఎరుగరు. ఆనాటి మహిళల అవర్శాలలో, ఊహా చిత్రాలలో మన సాంస్కృతిక వారసత్వం ఇమిడివుంది. ఆధునిక సమానత్వం మీద, హుందాపైనా, న్యాయం, నీతి, కరుణ, ప్రాతిపదికలపై నూతన మానవ సమాజాన్ని నిర్మించాలనే తహతహతో ఆనాటి దేశ విముక్తి పోరాటానికి అలా వారు ఆయత్తమయినారు. దేశ ప్రజలందరికీ ఆర్థిక, సామాజిక, రాజకీయ న్యాయాన్ని అందించే నిమిత్తం అంటే వర్గ, వర్ణ, మత, ప్రాంత, లింగభేద రహితమైన స్వరాజ్యాన్ని వారు ఆకాంక్షించారు. సర్వులకూ న్యాయాన్ని సమకూర్చే నూతన భారతదేశ నిర్మాణాన్ని ఒక సవాల్‌గా 45 ఏళ్ళ క్రిందటే కోరుకున్నాం.

కానీ ఇప్పుడు ఏ పరిస్థితులలో మనం ఉన్నాం? అసమానత్వం, దారిద్ర్యం, నిరుద్యోగం పెరిగాయి. 45 సంవత్సరాల "అభివృద్ధి" కొద్దిమందిని ధనవంతులను చేసింది; అధిక సంఖ్యాకులయిన ప్రజానీకాన్ని బీదలుగా చేసింది. దారిద్ర్యం, ఆకలి, తక్కువ ఆదాయాన్ని ఇచ్చే ఎక్కువ పని, కుటుంబాలను పోషించటానికి, పెంచటానికి అవసరమైన వస్తువుల ధరలు పెరగటం వీటివల్ల ఎక్కువ భారాన్ని స్త్రీలు మోస్తున్నారు. అందువల్లనే జనాభాలో స్త్రీల దామాషా సంఖ్య తగ్గిపోతున్నది. గర్భస్థ స్త్రీ పిండాలను నాశనం చేయటం, వరకట్న మరణాలు, మానభంగాలు, సామూహిక మానభంగాలు, హత్యలు అత్యధిక సంఖ్యలో జరుగుతుండటం సంభవిస్తున్నది. ఇలా సామాజిక అణచివేత, హింస అనేక విధాలుగా పెరుగుతున్నాయి. తద్వారా స్త్రీలలో అశాంతి అసమర్థత పెరిగిపోతోంది. ఈ పరిస్థితికి ఎవరు బాధ్యులు? స్త్రీల రక్షణకోసం, ఉద్దేశింపబడిన శాసనాలను రాజ్యంయొక్క వివిధ ప్రాతినిధ్య సంస్థలే భంగపరుస్తున్నాయి. ఈనాడు నిల్వలోవున్న హక్కులను లేకుండాచేయటం జరుగుతున్నది. ఉదాహరణకు విడాకులివ్వబడిన ముస్లిం స్త్రీలు భర్తలనుండి మనోవర్తి కోరకుండాచేసే కేంద్ర శాసనం, వేతన సంఘం సిఫారసుమీద మాతృత్వ సౌకర్యాలను కుదించటం ఇటీవలి ఉదాహరణలు. ప్రజల హక్కులను, ప్రజాస్వామిక సంస్థలను బలహీనపరిచే ప్రక్రియలలో స్త్రీల హక్కులమీద విపరీత సంఖ్యలో జరుగుతున్న ఈ దాడులు భాగమని గ్రహించాలి.

అంతేకాదు ఈనాడు అవినీతి, హింస, ద్వేషం, స్వార్థం, పురుషాధిపత్యం స్త్రీలమీద విలయతాండం చేస్తున్నాయి. అయినా మొక్కవోని స్థిరచిత్తంలో స్త్రీలు స్త్రీజనాభ్యుదయాన్ని, తద్వారా దేశాభ్యుదయాన్ని ఆకాంక్షిస్తున్నారని చెప్పటం అతిశయోక్తి కానేకాదు. ఆనాటి దేశభక్తి ఈనాటికీ స్త్రీలలో ఇనుమడించిందేకాని ఏమాత్రం తగ్గిపోలేదు. ఆ ధ్యేయంతోనే ఈ గ్రంథ రచన జరిగింది. స్వరాజ్యకాలానికి ముందున్న స్త్రీల స్థితి, స్వరాజ్య పోరాటంనాటి వారి చైతన్యం వారి భాగస్వామ్యం, స్వరాజ్యానంతరం వారి అభివృద్ధి, రాజ్యాంగం, చట్టాలు కొంతలోకొంతయినా వివరించడం జరిగింది; ఇంకా వారిపై జరుగుతున్న దమననీతి, వారిస్థాయి, హోదా, విద్యా ఉద్యోగాలలో వారి పరిస్థితుల్లాంటివి తెలుసుకొన్నాం. చివరిగా వారికి స్వేచ్ఛా సమానత్వాలు ఎలా సిద్ధించాలో, ఏఏ వ్యూహాలు వారు వేసుకొని ముందడుగు వెయ్యాలో చెప్పుకున్నాం. ఆ సగభాగమైనా స్త్రీలలో ఇంకా ధైర్యం, చొరవ ముందుచూపు పెరిగితే తమ హక్కులు అనుభవించగలరని ఆశించటం అతిశయోక్తి కాదు.

'తెలుగు సాహిత్యం : సామాజిక సంస్కరణ, విప్లవం'పై సెమినారు
సెప్టెంబరు 12, 13 తేదీలలో

# జాతీయోద్యమ పోరాటంలో స్త్రీలు

మరో ఏడు ఏళ్ళల్లో మనం 21వ శతాబ్దంలో అడుగిడబోతున్నాం. అయినా బి. సి ఆరవందలు అంటే మను స్మృతికాలంలోనే మనమింకా జీవిస్తున్నాం అనేదానికి బోలెడన్ని ఆధారాలు వున్నాయి. ఆధునికత అనే నిచ్చెనకు మొదటి మెట్టులోనే మనమింకా నిలబడివున్నాం. మనది ప్రజాస్వామిక రాజ్యాంగం. ఇందులో స్త్రీ పురుష తేడాలు లేవని రాసుకున్నాం. పురుషులకు వుండే హక్కులన్ని స్త్రీలకు వున్నాయని మనకు తెలుసు. అయినా సగభాగంలోవున్న స్త్రీలు రెండవ తరగతి పౌరులుగానే భావింపబడుతున్నారనేది నగ్నసత్యం. ముఖ్య నిర్ణయాలు తీసుకునే హక్కు వారికి లేదు. వాటిని అంటే జాతీయ వ్యవహారాలను అమలుపరచటానికి స్త్రీలింకా ముందుకు రావటంలేదు పురుషులు రానివ్వరుకూడా. ఇంకా ఈ 20వ శతాబ్దంలో కూడా గర్భస్థ పిండం ఆడదని తెలిస్తే చంపటం చూస్తూనే వున్నాంకదా? అందువల్లే 1901 జనాభా లెక్కల్లో వెయ్యిమంది మగవారికి 971 మంది ఆడవాళ్ళు వుంటే 1971లో వెయ్యికి 929 మందికి తగ్గిపోయారు. ఏ సమాజంలోనైనా 46.5 శాతంగా వున్న ఆడవారిని రెండవ తరగతినుండి మొదటి స్థానానికి అంటే గౌరవ స్థానానికి తేవటం అసాధ్యం అనక తప్పదు. అయినా ఆ మార్పుకోసం అనాదిగా ప్రయత్నాలు జరుగుతూనే వున్నాయి.

జాతీయోద్యమ పోరాటానికి పూర్వంకాని, పోరాట సమయంలోకాని, స్వరాజ్యానంతరం కాని స్త్రీల పరిస్థితిలో వారివారి జీవన విధానంలో అనేక మార్పులు వచ్చాయి. కూపస్థమండూకాల్లా పడివున్న స్త్రీలు గాంధీ పిలుపుతో నాలుగు గోడలు దాటి బైటికొచ్చారు. అప్పటికే వారిపై ఎన్నో ఆంక్షలు మరెన్నో విధి నిషేధాలు అమల్లో వుండేవి. అయినా ధైర్యంలోకాని, త్యాగంలోకాని పురుషులకు తీసిపోని రీతిలో కొంతమంది మహిళలు ఉద్యమంలోకి దూకటంవల్ల మిగిలినవారు సైతం చలించారు; ఆక్రోశించారు. ఆర్ద్రత కనపరిచారు. కారణం వారూ మానవమాత్రులే కదా! వారు సైతం మానవ విలువలను గౌరవించేవారే కదా! వారిలోకూడా దేశభక్తి పెల్లుబికిపోతుందిగదా! కనుక కర్తవ్య పరాయణత్వంతో ప్రతి ఒక్క మహిళలో చైతన్యం పెల్లుబికింది. ఆ ప్రభావమంతా దశల వారీగా వారి జీవిత

విధానంలో మార్పు తెచ్చింది. అంతేకాదు సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా వారిని ఎంతో ప్రభావితం చేసింది. ముఖ్యంగా పరిశీలిస్తే స్వరాజ్యానికి పూర్వం, స్వరాజ్య పోరాట సమయంలో, స్వరాజ్యానంతరం స్త్రీలలో మూడు విధాలయిన మార్పులు, తేడాలు మనకు గోచరిస్తాయి. కనుక ఈ దశలను సమన్వయంచేసి వాటికి ఒక విధమైన రూపురేఖలను కూర్చి, వాటిని సమన్వయి పరచటానికే ఈ విధానమయిన సాహిత్య ప్రక్రియ జరిగింది. ఇది అసంపూర్ణమే అయినా ఒక విధమయిన దృక్పధంతో వ్రాయటం జరిగింది. ఇందులో స్త్రీల అభివృద్ధి వుందనే భావమూ వుంది. వెనుకబడి వున్నారనే నగ్నసత్యమూ గోచరి స్తుంది. ఇవి రెండూ ఏకకాలంలో సాధ్యమా అనే సందేహం కలుగవచ్చు సాధ్యమే. ఎందుకంటే పరిణామదశలో వెనుకచూపూ, ముందుచూపూ రెండూ ఉంటాయి. అది మధ్యస్థ లక్షణం. ఆ లక్షణంతోటే సాగింది ఈ చరిత్ర. అలా అర్థం చేసుకుంటేనే ఈ స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీలపాత్ర, స్వాతంత్ర్యానంతరం వారి స్థితి తూకం వేయ గలం. అందువల్లే ఈ మూడు వర్గాల పయనం ఇలా వర్ణించడం జరిగింది.

ప్రపంచంలో విప్లవాలు ఎక్కడ వచ్చినా, ఏ కాలమందు జరిగినా, అవన్నీ దీనికి అధ్యయన యోగ్యాలే. ఇంగ్లండులో 1989లో బ్రిటిషు రాచరికానికి పరిమి తులు, హద్దులు విధించిన విప్లవంకాని, అమెరికాలో 177ంలో ప్రాతినిద్యాధికారమున్న వారే పన్నులు విధించగల హక్కుదారులు అనే "ప్రజాస్వామ్య" సూత్రాన్ని ఎలుగెత్తి చాటిన విప్లవంకాని, 1789లో స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము ఆదర్శాలుగా విజయవంతమైన ఫ్రెంచి విప్లవంకాని, 1917లో "భూమి, తిండి, శాంతి" నినాదాలతో కార్మికవర్గం, మధ్య తరగతి రష్యాలో సాధించిన విప్లవంకాని, 1947లో భారతదేశంలో పొందిన స్వాతంత్ర్యం ఇంకా 1949లో కర్షకబలంతో చైనాలో జరిగిన విప్లవం మొదలయిన చారిత్రాత్మక సంఘటనలను లోతుగా, సునిశి తంగా, సమదృష్టితో పరిశీలించినప్పుడే మన జాతీయోద్యమ పోరాటం అవగతమవు తుంది. ఆ పోరాటాల్లో ఆ దేశాల స్త్రీలు భారత స్త్రీలకన్న మిన్నగా పోరాడలేదని గ్రహించగలం. ముఖ్యంగా ఫ్రెంచిస్త్రీలు మాత్రం తమ ప్రాణాలను ఒడ్డి పోరాడారు. ప్రపంచ చరిత్ర అవలోకనం చేసుకున్నప్పుడు మాత్రమే మన స్త్రీలు తక్కువేమీ కాదని అర్థం చేసుకోగలం. కొన్ని ఉద్యమాల్లో, కొన్ని లక్షణాల్లో కొన్ని దేశాల స్త్రీలు ముందంజవెయ్యవచ్చు. అయినా ఎవరి పరిధి వారిది, ఎవరి లక్ష్యం వారిది. ఎవరికి ఎవరూ తీసిపోరనేది నగ్నసత్యం.

## స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీల త్యాగాలు :

ఈ సందర్భంగా దేశ స్వాతంత్ర్య పోరాటంతో అపూర్వ త్యాగాలు చేసిన ఆంధ్ర మహిళల గురించి ముందుగా వివరించటం మన విద్యుక్త ధర్మం. మహాత్మా గాంధీ నడిపిన ఉద్యమాలలో పాల్గొన్న ఆంధ్ర స్త్రీలు గణనీయమైన సంఖ్యలో వున్నారు. కొందరు త్యాగాలకు పేరెన్నికగంటే మరికొందరు కార్యదీక్షకు ప్రసిద్ధి పొందారు. కొందరు అసమాన నాయకత్వ లక్షణాలను ప్రదర్శిస్తే ఇంకా కొందరు క్రమశిక్షణకు, మేటి ధైర్యానికి ప్రతీకలుగా వెలుగొందారు.

త్యాగాలు చేసిన మహిళల్లో మాగంటి అన్నపూర్ణకు పేరుప్రఖ్యాతులు వచ్చాయి. విదేశంలో విద్యాభ్యాసం చేస్తున్న భర్తను చేరవలసిన అన్నపూర్ణమ్మ 1921లో గాంధీజీ బెజవాడ ఉపన్యాసాన్ని విని ఉత్తేజితురాలై తన సువర్ణాభరణాలను అన్నింటిని గాంధీజీకి సమర్పించి, పట్టు వస్త్రాలను విడనాడి ఖద్దరు వస్త్రధారణకు పూనుకున్నది. తరువాత ఏలూరు సభలో మిగిలిన తన నగలనన్నింటినీ గాంధీజీకి ఇచ్చి త్యాగధనురాలయింది. ఖద్దరు వ్యాప్తికి ఆరేళ్ళు అవిరళ కృషి సలిపి చిన్నవయస్సులోనే మృతి చెందితే గాంధీజీ ఆమెను ప్రశంసిస్తూ తన సంతాపాన్ని తెలియజేశాడు.

కాలగతిని అనుసరించిగాని, దీక్షాదక్షతలను మదింపు చేయడంలోకాని లెక్కకడితే దువ్వూరి సుబ్బమ్మను పేర్కొనాలి. ఆంధ్రలో స్వాతంత్ర్య పోరాటంలో దూకిన ప్రథమ మహిళ దువ్వూరి సుబ్బమ్మ. అందరికన్నా ముందుగా అరెస్టయిన స్త్రీమూర్తి ఆమెయే. మహాత్మాగాంధి 1922లో సహాయ నిరాకరణోద్యమాన్ని నిలిపివేస్తే పోరాటంలో స్తబ్ధత ఆవరించిన తరుణంలో సుబ్బమ్మ ఖద్దరు కొరకు నిరంతర ప్రచారం సాగించింది. 1857నాటి సిపాయిల తిరుగుబాటు క్రూరంగా అణచివేసిన జనరల్ నీల్ విగ్రహాన్ని మదరాసు నగరంలో నుండి తొలగించాలని సత్యాగ్రహం సాగితే మొదటి జట్టు సత్యాగ్రహంలో పాల్గొన్న గౌరవం బ్రహ్మజోస్యుల లక్ష్మీనరసమ్మతోపాటు దువ్వూరి సుబ్బమ్మకు దక్కింది.

ఆమె ఉపన్యాసాలు శక్తివంతమైనవి. ఖద్దరు ధారణ గురించి చేసిన ప్రచారంలో ఆమెకు ఆమెయే సాటి. ఆమెకు అలుపు లేదు; విశ్రాంతి లేదు. ఆమెకు 'దేశబాంధవి' అను బిరుదు ఇచ్చి ఆంధ్రప్రజలు తమ కృతజ్ఞతను తెలుపుకున్నారు. ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో ఆమె పోరాటంలో ముందు నిలిచింది. ప్రభుత్వం ఆమెను బందీగా చేసింది. అలాంటి 'దేశబాంధవి' చిరస్మరణీయురాలు, కళావంతుల కులాన్ని

సంస్కరించిన యామినీ పూర్ణతిలకం 1920 నుండి గాంధీజీ ఉద్యమంలో కృషిచేసిన మహిళ. అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యురాలు. విదేశీవస్త్ర బహిష్కరణోద్యమంలో ఆమె విశేషంగా శ్రమించింది. అలాగే ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ శిసలైన కాంగ్రెస్‌వాది. 1932లో ఆమెను ప్రభుత్వం అరెస్టు చేసింది. నిషేధించబడిన సారస్వతాన్ని ఆమె పంపిణీ చేసింది. 'వీరభారతి' అనే పేరుగల రహస్య పత్రిక వెలువడడానికి ఆమె ఎంతో దోహదం చేసింది. వార్తాహారిగా కూడా ఆమె పనిచేసింది. పాలకోడేటి శ్యామలాంబ 1921లో ఖద్దరు విక్రయ బాధ్యతను చేపట్టింది. ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో ఆమెకు ఏడు మాసాల శిక్ష వేసింది ప్రభుత్వం. ఆమె కుటుంబంలో అందరూ అరెస్టు అయి గొప్ప సంచలనాన్ని కలిగించారు. మాగంటి అన్నపూర్ణమ్మ తల్లి కలగా పిచ్చమ్మ విదేశీ వస్త్ర దుకాణాలను, కల్లు, సారా సర్కారు పాటలను పికెటింగ్‌ను చేయటంలో ప్రముఖపాత్ర నిర్వహించింది. అనేకసార్లు కారాగారవాసం చేసింది. ఆచార్య రంగా భార్య భారతీదేవి రంగా 1932లో సంవత్సర జైలుశిక్షకు గురి అయింది. గాంధీ భావాలవల్ల ఉత్తేజం పొందిన ప్రముఖ మహిళామణి ఆమె. కాంగ్రెసువాదుల్లో లబ్ధప్రతిష్టులు వేదాంతం కమలాదేవి. రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ రహస్య సమావేశానికి అధ్యక్షత వహించిన నాయకురాలు. 1932లో బ్రిటిష్‌ప్రభుత్వం ఆమెకు ఆరునెలలు జైలుశిక్ష విధించి సత్కరించింది. ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి మద్రాసులో ఉప్పుసత్యాగ్రహ సందర్భంగా అరెస్టు అయిన తెలుగు స్త్రీలలో ప్రథమురాలు. తరువాత ఆమె కాంగ్రెసు మంత్రివర్గంలో సభ్యురాలయింది. దరిమిలా ఏలూరు పురపాలక సంఘాధ్యక్షురాలయిని మూల్పూరు చుక్కమ్మ కాంగ్రెసు ఉద్యమంలో కృషిచేసి బ్రిటిష్ సర్కారువారి నిషేధాజ్ఞలకు గురిఅయిన వ్యక్తి. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని జైలుకు వెళ్ళింది ఆమె. ఆదుర్తి లక్ష్మీబాయి వ్యక్తిగత సత్యాగ్రహకాలంలో అరెస్టుకులోనై ఒక సంవత్సరం జైలుశిక్ష అనుభవించింది. ఇవి కొందరు ప్రముఖుల పేర్లు మాత్రమే. ఇంకా ఎందరో, మరెందరో మహత్తర త్యాగాలు చేసి, అష్టకష్టాలుపడి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న విదుషీమణులున్నారు.

జైళ్ళల్లో స్త్రీ సత్యాగ్రహ ఖైదీలను బ్రిటీష్ ప్రభుత్వం అనేక ఇబ్బందులకు గురిచేసింది. తల్లులను పిల్లలను వేరుచేసింది. వారిని బొట్టు పెట్టుకోనీయలేదు. గాజులను పగలకొట్టారు. ప్రసవ సమయంలో కూడా గర్భిణీ స్త్రీలను జైలు నుండి వదిలిపెట్టలేదు. నలుగురు స్త్రీలు జైల్లోనే ప్రసవించవలసి వచ్చింది. స్త్రీ వాలంటీర్లను పోలీసులు దూషించారు; బూతులు తిట్టారు. అవమానించారు. రంగు నీటిని, మురికి నీటిని వారిపై చల్లారు. అరెస్టుచేసి దూరప్రాంతాలకు తీసుకెళ్ళి వదిలారు. ఇన్ని కష్టాలకు

లోనయినా మొక్కవోని ధైర్యంతో ఆంధ్ర స్త్రీలు పోరాటంలో పాల్గొని అశేష త్యాగాలు చేశారు. స్వరాజ్య సంపాదన పోరాట సందర్భంగా వారి త్యాగం వృధా కాలేదు. ఆ అజ్ఞాత స్త్రీల త్యాగాలకు జోహార్లు అర్పించి వారి త్యాగనిరతిని వెలుగు లోకి తెచ్చి స్వాతంత్ర్యానంతరం స్త్రీల అభ్యున్నతిని, వారి ప్రస్తుత పరిస్థితిని వివరించి భవిష్యత్తుకు బాటలు వేయటం సమంజసం

బాలవిధవల దుర్భర శోచనీయస్థితికి వగచి, తపించి వారి ఉద్ధరణకు కంకణం కట్టుకున్న నారీ శిరోమణి లక్ష్మీబాయమ్మ. తెలుగునాట విధవా వివాహోద్యమానికి బాటలుతీర్చిన కందుకూరి వద్ద లక్ష్మీబాయమ్మ దంపతులు ఒక సంవత్సరకాలం రాజ మండ్రిలో వుండి కందుకూరి సద్గుణాలను పుణికిపుచ్చుకున్నారు. తరువాత స్వస్థల మైన గుంటూరు చేరి విధవా వివాహ కేంద్రాన్ని 1902లో స్థాపించారు. ఆ సంవత్స రమే ప్రథమ విధవా వివాహాన్ని నిర్వహించారు. అలా సుమారు నలభై సంవత్సరాలు గుంటూరు పట్టణంలో జరిగిన విధవా వివాహాలకు లక్ష్మీబాయమ్మ, ఆమె భర్త పెళ్ళి పీటల మీద పెద్దలుగా కూర్చుని నిర్వహించేవారు.

1929లో గాంధీజీ ఆంధ్రప్రాంతంలో పర్యటించారు. దాంతో ఆంధ్ర స్త్రీలలో చైతన్యం, జాగృతి పెల్లుబికింది. వారు శాసనోల్లంఘనానికి పూనుకున్నారు. లక్ష్మీ బాయమ్మ ఉప్పు తయారుచేసే స్త్రీల జట్టుకు నాయకత్వం వహించింది. సముద్రానికి వెళుతున్న ఆమెను పోలీసులు మార్గమధ్యంలోనే అరెస్టుచేశారు. ఆంధ్రలో విదేశీవస్త్ర బహిష్కరణోద్యమం ముమ్మరంగా సాగింది. ఆ ప్రయత్నానికి సమర్థవంతమైన నాయకత్వాన్ని అందించిన ఘనత లక్ష్మీబాయమ్మది. గాంధీజీ 1940లో ప్రారంభిం చిన వ్యక్తి సత్యాగ్రహంలో గాంధీజీ ఆమెను ఎంపిక చేశారు. తదుపరి ఆమె మళ్ళీ అరెస్టయి కారాగారవాసం చేసింది. ఆమె మహా నిరాడంబర జీవి. తెల్లని శుద్ధ ఖద్దరు వస్త్రాలే ఆమె సొమ్ములు. నిస్వార్థసేవే ఆమె స్వరూపం. అనాథ బాలికలే ఆమె అనుంగు పుత్రికలు. సంఘసేవే ఆమె ఊపిరి. సంస్కరణాభిలాషే ఆమె ధనం. శారదానికేతనమే ఆమె ప్రాణం. ఆ సంస్థపై ఆమెకు ఎనలేని అభిమానం. నికేతనం లోని విద్యార్థినుల శీల సంరక్షణ ఆమె బాధ్యత. అందుకే అక్కడ ఆమె నివాస ముండేది. నికేతంపై తప్ప మరిదేనిపైనా ఆమెకు మమకారం లేదు. దానికోసమే అహరహం శ్రమించింది. దాని సేవలోనే ఆమె అసువులు బాసింది. ఇటు సంఘసేవ అటు దేశసేవ, మధ్యలో సంఘర్షణ కార్యక్రమాలతో జీవితాన్ని సార్థకం చేసుకున్న ధన్యజీవి లక్ష్మీబాయమ్మ.

జాతీయోద్యమంలో, సంఘసేవలో, సంస్కరణలో, స్త్రీ విద్యలో, స్త్రీ జనాభ్యుదయంలో దుర్గాబాయి మహా ధీరోదాత్త. ఆమె గాంధీ అహింసా సూత్రాలకు, పరదాస్య విముక్తి సిద్ధాంతానికి ప్రభావితమయి బ్రిటీష్ పరిపాలనకు వ్యతిరేకంగా 1932లో ఉప్పు సత్యాగ్రహంలో, 1940లో వ్యక్తి సత్యాగ్రహంలో, 1942లో క్విట్ ఇండియా పోరాటంలో పాల్గొన్నదని ఆమెను రాయవెల్లూరులో మూడు సంవత్సరాలు జైలులో నిర్బంధించారు అప్పుడామె మిగతా ఖైదీల దుస్థితి చూచి అధికారులను ప్రశ్నిస్తే వారు ఈమెను 'తీవ్రవాది' అని అభివర్ణించి మూడవసారి మధిర జైలుకు మార్చారు. ఆమెమీది కోపంతో ఆహారంలో విషసంబంధమైన పదార్థాలను కలపడం వల్ల ఒళ్ళంతా సన్నని కురుపులు లేచి చీమూ, నెత్తురు కారేదట. అదిచాలక ఆమెచేత కారం దంపించేవారట. ఆ మంటకు తట్టుకోలేక అల్లాడిపోయేదాన్నని సభల్లో చెప్తూ వుండేది. రాయవెల్లూరు జైలులో వున్నప్పుడు దుర్గాబాయమ్మను రేపు ఉదయం అయిదు గంటలకు ఉరితీసేవారి ప్రక్కన వున్న కన్‌డెమ్డు సెల్‌లో నిర్బంధించారట. అయినా పట్టుసడలని ధైర్యంతో జాతీయోద్యమ పోరాటంలో గాంధీ, నెహ్రూ లాంటి మహానాయకులతోపాటు మహా ధైర్యసాహసాలతో పోరాడిన దుర్గాబాయి 1946లో రాజ్యాంగ నిర్ణయ సభకు మెంబరయింది. అదే ప్రొవిజనల్ పార్లమెంటుగా వుంది కొంతకాలం. దేవదాసీ వృత్తి జుగుప్సాకరమని కాకినాడలో ఈమె వారికోసం ఒక ఉద్యమాన్ని జరుపుతుండగా గాంధీ కాంగ్రెసు నిధి కోసం అక్కడికొచ్చాడు. ఆ దేవదాసీలు తమకు గాంధీ ఉపన్యాసం వినిపించమని ఈమెను కోరగా గాంధీని మా సభలో అయిదు నిమిషాలు మాట్లాడమని అడిగింది ఈమె. అయిదు వేలు ఇస్తే అయిదు నిమిషాలు మాట్లాడతాడని బులుసు సాంబమూర్తి ఈమెతో హాస్యోక్తితో పలికాడు. అప్పుడు దుర్గాబాయి వెళ్ళి చందాల ద్వారా అయిదు వేలు తెచ్చిచ్చింది. ఆనాడు ఆ సభలో గాంధీ నలభై నిముషాలు ఉపన్యసించగా దుర్గాబాయమ్మ తెలుగులో తర్జుమా చేసింది. అలా ఆమె జీవితాంతం మహిళాసేవ, దేశసేవ చేసిన సంఘసేవకురాలు. ముఖ్యంగా జాతీయోద్యమ పోరాటంలో తుపాకుల తూటాలకు, పోలీసులకు ఎదురొడ్డి దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన ధీరోదాత్త, సంస్కర్త, సంఘసేవకురాలు కూడా. ఇలా అనేకమంది స్త్రీలు తమవంతు కర్తవ్యంగా స్వాతంత్ర్యోద్యమంలో పోరాడిన విషయం చరిత్ర రుజువు చేసింది.

# స్వాతంత్ర్య పోరాటం : స్త్రీల అభ్యుదయం

స్వరాజ్యం వచ్చింది. ప్రజలలో ఆనందోత్సాహాలు వెల్లివిరిసాయి. తమ స్థితి గతులు ఎంతో బాగుపడతాయని ఆశించారు. సత్ఫలితాల కోసం ఎదురు చూచారు. 45 సం॥రాలు ఎన్నో రంగాలలో ఎంతో కష్టపడి ఎంతోఅంత అభివృద్ధిని సాధించారు. దేశం పురోగమించింది. నదులకు ఆనకట్టలు కట్టాం. రైళ్ళ వేగం పెంచారు. విమాన సర్వీసులను అధికం చేశాం. ఎయిర్ కండిషన్ రైలు పెట్టెలను ప్రవేశ పెట్టాము. భారీ పరిశ్రమలు పెరిగాయి. సిమెంటు ఉత్పత్తి పెరిగింది. ఉద్యోగాల సంఖ్య నాలుగు రెట్లయింది. ఇంత ప్రగతి వస్తే స్త్రీల స్థితిగతులు ఎలా ఉన్నాయనే ప్రశ్న ఉదయిస్తుంది. 50 శాతంగా వున్న మహిళల అభివృద్ధి మీదనే దేశాభివృద్ధి ఆధారపడి వుంటుంది. కనుక గతచరిత్రను నెమరేసుకుని, వర్తమానాన్ని అంచనా వేసుకొని భవిష్యత్‌కు బాటలు వేయటం సమంజసం.

స్వాతంత్ర్యానంతరం స్త్రీల అభివృద్ధి విస్తరించిందని, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో ముఖ్యంగా విద్యా ఉద్యోగ విషయికంగా ఆమె హోదా, స్థాయి పెరిగాయి అనే వాదన ప్రబలంగా వినబడుతోంది. ముఖ్యంగా మహిళా దశాబ్దానంతరం స్త్రీలు ఎనలేని ప్రగతిని సాధించారని వింటున్నాం. ఈనాటి స్త్రీ ఆటలలో, పాటలలో, సంగీత సాహిత్యాలలో చిత్రలేఖనంలో, సాంకేతిక రంగాలలో, వైద్యశాస్త్రంలో, టెక్నికల్ కోర్సులలో, సమానత్వాన్ని సాధించిందని భావిస్తున్నాము. ఎంట్రెన్సు పరీక్షలలో స్త్రీలే ముందడుగు వేస్తున్నారని వింటున్నాము. లాయర్సుగా, "ఎంబాసిడర్లు"గా, మంత్రులుగా, ఎం.ఎల్.ఎ. లుగా, ఎం.పి. లుగా ముందు ముందు కొస్తున్నారు. ఈనాటి స్త్రీ సాధించలేని కార్యరంగం లేదని, స్వేచ్ఛ సమానత్వాలు పురుషులతో సమదీటుగా అనుభవిస్తున్నదని అనుకుంటున్నాము. కుటుంబ నిర్వహణలో, ఉద్యోగ విధులలో, పోటీ పరీక్షలలో, పరుగు పందాలలో, "పైలట్లు"గా కూడా పనిచేస్తున్నారు. షాపింగు, బ్యాంకింగు హౌస్ కీపింగు ఒకటేమిటి సర్వరంగాలలో సమానంగా పయనిస్తున్నారు. ఈనాడు స్త్రీలు సహించలేని కార్యరంగం లేదని చెప్పవచ్చు. ఈ అభివృద్ధి అంతా కాదనలేని నగ్న సత్యం. అయితే ఇదంతా స్త్రీల సర్వతోముఖాభివృద్ధా, నాగరికతా ప్రభావమా, విజ్ఞానశాస్త్ర పరిశోధనా ఫలితమా అనే ప్రశ్నలు మనని వెంటాడుతున్నాయి. ఒక విధంగా చూస్తే అభివృద్ధి, మరోవిధంగా ఆలోచిస్తే వెనుకబడినతనం రెండూ సమాంతరం రేఖల్లా గోచరిస్తున్నాయి. లేకపోతే ఇన్ని వరకట్న మరణాలు-1985లో

990 వుంటే 1986 లో 13.9 కి, 1991 నాటికి 2 వే కు పెరుగుతాయి అని ఆలోచించాలి. ఇంకా హత్యలు, అత్యాచారాలు, ఆత్మహత్యలు ఎందుకు జరుగుతున్నాయనే బాధతో మరికొన్ని ప్రశ్న పరంపరలు మనల్ని వేధిస్తున్నాయి. కనుక ఏది సత్యం, ఏది నిత్యం అనే విషయాన్ని సునిశితంగా పరిశీలించాల్సిన పరిస్థితి ఏర్పడింది. మరో ముఖ్య విషయం ఉంది. ఇలా అన్ని రంగాలలో సాధించిన అభివృద్ధి శాతం అయిన మాత్రమేననేది విస్మరించరాని విషయం మనం ఇప్పుడు ఎలక్ట్రానిక్ యుగంలో పురోగమిస్తున్నాం. 20వ శతాబ్దంలో జీవిస్తున్నాం. ఆధునిక విధానంలో పయనిస్తున్నాం. ఇలాంటి స్త్రీయొక్క ఈ అభివృద్ధి అంతా నాగరికతగా పేర్కొనవచ్చు. అంటే పూర్వంకంటే వేషభాషలలో, పనిముట్ల వాడకంలో రోజు రోజుకీ ఆధునికత పెరిగింది అన్నమాట. అంటే ఒకప్పుడు పిడకలతో వంటచేసే వాళ్ళం. ఇప్పుడు ఎలక్ట్రానిక్ పరికరాలు వాడుతున్నాం. ఒకప్పుడు ఒ ఎద్దు బండిమీద ప్రయాణాలు సాగించేవాళ్ళు ఇప్పుడు జెట్ విమానాలమీద పయనిస్తున్నాం. ఇదంతా సైన్సు పెరగటంవల్ల జరిగిన సాంకేతిక అభివృద్ధియొక్క ప్రభావము. దీన్నే నాగరికత అంటాం. ఇది చూసి మనమెంతో అభివృద్ధి చెందామనుకోవటం పిచ్చి భ్రమ. ఉదాహరణకు సాంస్కృతికపరంగా మనం ఈనాడు 16వ శతాబ్దంలోనే జీవిస్తున్నాం అంటే మన భావాలలో ఇంకా మార్పురాలేదన్నమాట. ఈనాడు కూడా స్త్రీని రెండవ తరగతిగానే చూస్తున్నారు. ఆమెకు పురుషునితో సమానమైన హోదా లేనేలేదు ఆమె పుట్టుక ఒక శాపంగా భావిస్తున్నారు. ఆమెను పెంపకంలో కుమారునితో సమానంగా పెంచటంలేదు, విద్యా విషయికంగా స్త్రీవిద్య నిర్లక్ష్యం చేయబడ్డది. ఎంతోఅంత కట్నం ఇచ్చి వదిలించుకుంటే చాలుననే భావం ప్రబలంగా ఉంది. అందువల్లే స్త్రీల అక్షరాస్యత ఈనాటికీ 20 శాతంకన్నా పెరగలేదు. కారణం ఆమె పెళ్ళికోసమే పుట్టిందనే భావం ప్రబలంగాఉంది. ఆమె ఆజన్మాంతం ఏదో ఒక మగదక్షత నీడలోనే బ్రతకాలని "స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అనేది తరతరాలుగా వస్తున్న భావం. అది మన నరనరాన జీర్ణించి పోయింది. అందుకే ఈనాడు చట్టాలలో ఉన్న హక్కులను అనుభవించలేని దుర్భర పరిస్థితుల్లో మనమున్నాం. బిడ్డలని కని పెంచుతూ, భర్తకు సేవలు చేస్తూ బ్రతికితే చాలదా అనే భావం స్త్రీలోకూడా ఉంది.

కుటుంబ విషయం తీసుకుంటే ఆమెకు పెళ్ళికావటమే గగన కుసుమమై పోతుంది. కట్నం ఇవ్వలేనిపిల్ల ఉద్యోగం ఉన్నా లేకున్నా కన్యగానే మిగిలిపోతున్నది. ఎంత అందమున్నా, ధనమున్నా, ఉద్యోగముడున్నా, ఆస్తిఉన్నా, కట్నమిచ్చినా,

పెళ్ళికాగానే ఆమె భర్తకు లొంగి బ్రతకవలసిందే. అతని మాటలను వ్యతిరేకిస్తే నిలువ నీడకూడా ఉండదు. విడాకులిచ్చి బయటకివస్తే తల్లిదండ్రులు, సమాజము గర్హిస్తుంది; ఈసడిస్తుంది. ఇంకా భర్తల దాష్టీకం ఇంతాఅంతాకాదు. కొట్టేవాళ్ళు, తిట్టేవాళ్ళు అపవాదులపాలు చేసేవాళ్ళు అనేకమందిని మనం చూస్తున్నాం. ఇంటింటికి ఒక కథ వింటున్నాము బయటకి చెప్పుకుంటే తంతాడు. మనస్సులో భరించలేని ఆవేదనలతో అల్లాడిపోతున్నారు మన స్త్రీలు. ఆఖరికి కన్న తల్లిదండ్రులు కాస్తంత చోటుకూడా ఇవ్వరు. ఆ అన్యాయకురాలికి చివరకు మరణమే శరణ్యం అవుతోంది. అందువల్లే వరకట్న మరణాలు నానాటికి ప్రబలిపోతున్నాయి. అలాగే ఇక అత్యాచారాల విషయం ఆలోచిస్తే శారీరకంగా, మానసికంగా ఎన్నో రకాల గాథలు జరుగుతున్నాయి.

ఇక హక్కుల విషయం ఆలోచిస్తే మతధర్మశాసనాల (పర్సనల్ లా) ప్రకారం తన పిల్లకు తాను గార్డియన్ కాదు. ఆస్తి విషయంలోకూడా తేడాలున్నాయి. స్త్రీకి తానుగా దత్తత తీసికొనే అధికారంకూడా లేదు. ఆర్థిక రంగాలలో సంపాదిస్తున్న స్త్రీకిగాని, స్వంత ఆస్తులున్న స్త్రీకిగాని తన ఆస్తిపై కొంత మెరుగయినా ఏ స్త్రీకి కూడా పూర్తిగా ఆర్థికాధిపత్యంలేదు అనేదానికి బోలెడన్ని తార్కాణాలున్నాయి. స్త్రీ విద్యావంతురాలైనా, ఉన్నతోద్యోగియైనా, ప్రతిభావంతురాలైనా ఆమెకు ఇంటిపని, వంటపని, పిల్లల బాధ్యత తప్పటంలేదు. అవి ఆమెకు నిర్దేశింపబడిన విధ్యుక్త ధర్మాలుగా పరిగణింపబడుతున్నాయి.

స్వరాజ్యం వచ్చిన తరువాత హిందువుల శాసనాలలో ఎంతో మార్పు వచ్చింది. ముస్లిం, క్రైస్తవ సమాజాలలో అసలు మార్పులేదు. హిందువులలో బహుభార్యాత్వం పోయింది. ఇది పరిగణింపదగిన పరిణామం. కాని ఇంకా ముస్లిం సమాజంలో బహు భార్యాత్వం ఉండటం శోచనీయం. స్వాతంత్ర్యం వచ్చిననాడు వివాహ విషయికంగా స్త్రీకి రెండవస్థానం ఉండేది. అది ఈనాటికీ ఇంకా అలాగే సాగుతున్నది అనేది పచ్చినిజం. వివాహిత తనకున్న పెద్ద ఉద్యోగాన్నయినా వదులుకొని భర్తవున్న ఊరిలో ఉద్యోగం చేయాలి. ఆమె జీవితం అతని ఇష్టాయిష్టాలపై ఆధారపడి అతనిచుట్టూ పరిభ్రమించాలి.

ఆనాడూ ఈనాడూ కూడా మృగ్యమయింది. కాకపోతే స్వరాజ్యానికి పూర్వం కులాంతర వివాహాలు ఇంతమించుగా లేవని చెప్పవచ్చు. ఒకరకమైన అలాంటి వివాహాలు చెల్లేవికావు. ఈనాడు శాసనరీత్యా వర్ణాంతర వివాహాలకు అడ్డంకులు లేవు. కాని ఆచరణలో అవి అరుదుగా జరుగుతున్నాయి. కొన్ని సమాజాలలో కుటుంబాలలో వాటికి ప్రబలమైన వ్యతిరేకత వుంది. స్వరాజ్యానికి పూర్వం కొన్ని కులాలలో కన్యలను అమ్మేవారు. ఈనాడు వరకట్నం వచ్చింది. అయితే వరకట్నాన్ని నిషేధిస్తూ 1961లో శాసనం వచ్చింది. 1984లో, 1985లో అనేక సవరణలు వచ్చాయి. కరకట్నం తీసుకోవడం తప్పని అంగీకరిస్తున్నారు. కాని పుచ్చుకొంటున్నారు. హిందువులలో పుట్టిన ఈ దురాచారం ఈనాడు క్రైస్తవ ముస్లిం సమాజాలకుకూడా ప్రాకింది. ఇది శోచనీయం.

స్వరాజ్యం రాకముందు హిందువులలో విడాకులు లేవు. 1948లో కొన్ని రాష్ట్రాలలో 1955లో దేశం మొత్తంమీద వచ్చిన శాసనాల ఫలితంగా హిందూ స్త్రీలకు విడాకుల హక్కు వచ్చింది. క్రైస్తవ స్త్రీకి విడాకులు రావడం చాలా కష్టం. 1869 నాటి వారి వివాహ శాసనం ఇంకా అలాగే ఉంది ముస్లిం స్త్రీల పరిస్థితి క్షీణించింది. ఏదైనా శాసనం అవకాశం ఇచ్చినా విడాకులు తీసుకున్న హిందూస్త్రీని వివాహమాడటానికి పురుషులు చొరవతో ముందుకు రావటంలేదు. చట్టాలెన్ని వచ్చినా సంస్కరణలెన్ని జరిగినా, రాజ్యాలు మారినా, అధికారాలు ఎవరి హస్తగతమయినా, రాజ్యాంగంలో సమానత్వంవున్నా, రాజ్యాంగ సవరణలెన్ని జరిగినా స్త్రీల హోదాలో మాత్రం చెప్పుకోతగ్గ మార్పు రానేలేదు తరతరాల భావదాస్యం అంత తేలిగ్గా మారిపోదనేదానికి ఎన్నో తార్కాణాలు వున్నాయి. సుమారు వంద సం॥రాల నాడు కందుకూరి లాంటి సంస్కర్తలు విధవావివాహాలు జరిపించినా, వాటికి వీలు కలిగిస్తూ 1856లో కేంద్రంలో శాసనం పుట్టినా ఈనాటికి వితంతువులను వివాహమాడటానికి చాలామంది సంకోచిస్తున్నారు. చాలామంది పురుషులు కన్యలతో వివాహాలను ఆశిస్తున్నారు. 160 సం॥రాల నాడు సహగమన వ్యతిరేక చట్టం పుట్టినా ఇంకా సతీసహగమనం జరుగుతూండటం మన వెనుకబడిన తనానికి నిదర్శనంగా భావించాలి. మరో ముఖ్య విషయాన్ని మనమిక్కడ ప్రస్తావించక తప్పదు. ఈనాటి సైన్సు విశ్వకవాటాలను ఛేదిస్తోంది. తద్వారా ఈనాడు టెస్టుట్యూబు బేబీలను సృష్టించేస్తున్నారు కాని పిండం ఆడదని తెలిస్తే గర్భస్రావం ద్వారా హతమారుస్తున్నారు. కారణం ఆడది అంటే ఆనాడు, ఈనాడు కూడా అవివాహిత స్త్రీని చిన్నచూపు

చూస్తున్నారు. ఒంటరిగా స్త్రీ జీవించరాదనే భావం ప్రబలంగా ఉంది. ఆమెకు సమాజంలో భద్రత తక్కువ. "ఎవ్వరివాన పీవు భీత హరిణేక్షణ" అని ప్రవరాఖ్యుడు లాంటి నాయకులు స్త్రీలను సంబోధించటం పరిపాటి అయింది. ఆమె ఎవరికో ఒకరికి చెందాలి. ఆమె ఒంటరిగా జీవిస్తూ తన వ్యక్తిత్వాన్ని పెంచుకుంటూ తన ప్రతిభా వ్యుత్పత్తులను వెలార్చుకుంటూ స్వావలంబనగా జీవించడాన్ని సమాజం సహించలేక పోవడం ఈనాటికీ దర్శనమిస్తున్నది. అందుకే 30 సం॥ స్త్రీకి 13 ఏళ్ళ అబ్బాయిని తోడుగా పంపడం ఆచారమయింది. ఇలా ఎన్నో మరెన్నో వున్నాయి. ఇవన్నీ స్త్రీ బానిసత్వానికి చిహ్నాలుకాక మరేవిటి?

ఆర్థిక రంగంలో స్త్రీల అధికారం, ప్రాతినిధ్యం లేదని మనందరికీ తెలుసు. పెద్దపెద్ద పరిశ్రమల్లో, వ్యవసాయ రంగంలో నెల జీతాలు లేని వర్కర్సు గాను, భూస్వాముల క్రింద భూమిలేని కూలీలుగాను పనిచేస్తున్నారు. వారికి ఏ విధంగానూ ఆస్తిహక్కు లేనేలేదు. దేశ ఆర్థిక విధానంలో వారికి ఎంతమాత్రం చొరవ తీసుకునే హక్కు లేనేలేదు. విద్యావంతులైన స్త్రీలనుకూడా ఆర్థిక రంగంలోనికి జొరబడ నివ్వరు. వృత్తివిద్యాపరమైన, విద్యావంతులైన మహిళలెందరో టెక్నికల్ ట్రయినింగులలో అర్హత కోల్పోతున్నారు. ఇక నిరక్షరాస్యులు ఏ విధంగానూ చలామణి కావటంలేదు అనేది పచ్చినిజం. సాంఘికపరమైన అసమానత్వంలో ముఖ్యమైనది స్త్రీ తక్కువజాతి వ్యక్తి అని, అయినా ఇంకా ఆమెను పూర్వపు స్థానంలో అంటే గృహిణిగా మాత్రమే ఉంచాలని పురుషజాతి నిర్దేశిస్తున్నది. ఆమె పుట్టుకనుండి మరణించే వరకు ఆమెమీద కంట్రోలు మగవారిదే. ఆ విషయంలో ఇంకా మార్పు రాలేదు. అవిద్య అజ్ఞానంవల్ల తమ దయనీయస్థితిని అర్థంచేసుకోలేని మహిళలు తమ బంగారు సంకెళ్ళకు తామే మురిసిపోతున్నారు. సైన్సు అభివృద్ధి కావటంవల్ల పుట్టబోయే ఆడ శిశువు అనర్థదాయకమని ఆమెకు, ఆమె తల్లికి కూడా కీడు తలపెడు తున్నారనేది మనకు తెలియని విషయంకాదు. 46.5 శాతంవున్న స్త్రీలపై అభివృద్ధి నిరోధకరమైన వ్యవహారాలను అరికట్టాలి. స్త్రీలపైవున్న పాతకాలపు భావాలను, వారిపైగల చిన్నచూపును, అసమానత్వభావాన్ని పరిపాలకులు, ప్రణాళికా అధికారులకు అమలుపరిచే నాయకుల పాతకాలపు వైఖరిని విడనాడటం అత్యవసరం అనక తప్పదు.

ఇక రాజకీయ రంగం పరిశీలిస్తే స్త్రీల ప్రాతినిధ్యం అత్యల్పం. అసలు రాజకీయాలంటేనే స్త్రీలకు "ఎలర్జీ". ఓటుహక్కు కూడా భర్త ఇష్టానుసారంగా

జరగాల్సిందే. రాజకీయాధికారం పురుషులకే ఉండాలని, పరిపాలనా దక్షత వారికే చెల్లుతుందనీ వాటి జోలికి పోరు. ఆ అధికారంకోసం అసలు పోరాటమే ఏనాడూ జరగనేలేదు. ఇంతా చెప్పుకున్న తరువాత ఒక్క విషయాన్ని గుర్తు చేయవలసి ఉంటుంది. రాజ్యాంగం ప్రకారం, లా ప్రకారం స్త్రీ మానవ వ్యక్తి. ఆమెకు పురుషునితోపాటు సమానత్వం పురుషునికి ఉన్న స్వేచ్ఛ ఉన్నట్లు ప్రకటనలు చేయడం జరిగింది. అంత వరకు ముదావహం. ఆ తరువాత ఆమె యెడ వివక్ష కనిపిస్తే దానిని ఖండించడం కొద్దికొద్దిగా మొదలయింది. మహిళా దశాబ్దం ధర్మమా అని స్త్రీలలో చైతన్యం పెల్లుబికింది. తామూ వ్యక్తిత్వంగల మనుష్యులమని స్త్రీలు తమ హక్కులను నిర్ధారించుకోవటానికి అతి స్వల్పమైన ప్రయత్నాలు సాగిస్తున్నారు. ఏదయినా గత చరిత్రతో పోలిస్తే ఈనాటి స్త్రీల ఆలోచనలలో నూతన పోకడలు దర్శనమిస్తున్నాయి. ఒకవిధంగా ఇది కొంతలోకొంత ముదావహమే.

అంతేకాదు ఇటీవల స్త్రీలకు వాస్తవాధికారం కావాలి అనే సంచలనాత్మక వాదం ఒకటి వెలుగులోకి వచ్చింది. స్త్రీలకు అధికారం కావాలనే ఉద్యమం అవసరం. ఏ ఒక్క రంగంలోనో వస్తే చాలదు. జీవితంలోని అన్ని రంగాలలోను మహిళలకు అధికారం రావాలి. అంటే కౌటుంబిక, సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, తాత్విక రంగాలన్నింటిలో వాస్తవాధికారం స్త్రీలకు చెందాలి అనేదే ఆ వాదం. అసలు అధికారం రెండు రకాలు. నామమాత్రమైన లాంఛనాయుత అధికారం మొదటిది. అంటే పేరుకు స్త్రీలకు అధికారం ఉన్నట్లు కన్పించినా అది వుండీ లేనట్లే. సిసలయిన, అసలయిన అధికారం రెండవది. మొదటిదానిలో స్త్రీలు అధికారాన్ని చలాయించ వీలు లేదు. రెండవదానిలో వారు ఆ అధికారాన్ని వినియోగించగలరు. ఇది చాలా ముఖ్యమయిన తేడా అని గ్రహించాలి. ఈ విషయాన్ని ఆకళింపు చేసుకున్నవారికి అధికార పదవులను చేపట్టటం వేరని, ఆ అధికారాన్ని వాస్తవానికి అనుభవించటం లేదని తేలుతున్నది. ఒక మహిళ పంచాయితీ బోర్డు సభ్యురాలు అని అనుకోండి. ఆమెకు పంచాయితీ అంటే ఏమిటో, దాని అధికారాలు ఏమిటో, పంచాయితీ సభ్యుల పాత్ర ఏమిటో, పంచాయితీ సభ్యులుగా ఏ పనులు చేయించటానికి తనకు అర్హత ఉందో తెలియకపోతే ఆమె అధికార పదవిని అధిష్టించినంత మాత్రాన ఆమెకు అధికారం వచ్చిందనిగాని తద్వారా మహిళలకు అధికారం చేకూరిందనిగాని భావించలేము. కనుకనే అధికారం ఆ పదవిలోవున్న మనిషికి అనుభవంలోకి రావాలంటున్నారు. ఇదంతా ఒకవిధమైన అభ్యుదయానికి, పురోగమనానికి నాంది అని చెప్పకతప్పదు.

# స్వాతంత్ర్యానంతర
# స్త్రీల చైతన్యం : భవిష్యద్దర్శనం

దేశ స్వాతంత్ర్యం నాటికి మన స్త్రీల పరిస్థితి చాలా ఘోరంగా వుండేది. ఒక వంక బాల్యవివాహాలు, మరోవంక బహు భార్యాత్వం, కఠోర వైధవ్యం, కన్యాశుల్కం దేవదాసి వృత్తి, వ్యభిచారం, కులతత్వం, అంటరానితనం, గొడ్రాలయితే వదలి వేయటం, కొట్టటం, తిట్టటం, వాతలు పెట్టడం, గెంటేయటం, చంపటం, పర్దాలో బిగించడం, ఆడపిల్లల హత్యల లాంటి ఘోర కిరాతకాలు మిక్కుటంగా వుండేవి. అమ్మాయి పుట్టిందంటే కుటుంబమంతా దుఃఖించేది. ఆమె పడబోయ్యే కష్టాలు, పెళ్ళి ఖర్చులు, పుట్టి టికి తిరిగివస్తే జరిగే అవమానాలు ఊహించుకుని పుట్టగానే చంపేవారు. చంపటానికి వివిధ రకాల ప్రక్రియలూ వుండేవి. అమ్మాయి మళ్ళీ తిరిగి రాకూడదనే కోరిక ఒక వంక, ఆడదాని జీవితమంతా కష్టాలే కదా బ్రతికి ఎవరిని ఉద్ధరిస్తుందని మరోవంక వుండే నిరాశతో అలా చేసేవారు. ఆఖరికి తల్లికూడా నేను ఆడదానిగా పుట్టి ఏం సుఖపడుతున్నాను. నా పిల్ల కూడా అంతేకదా అనే నిస్పృహతో చంపటంలో భాగస్వామి అయ్యేది. అలా చంపగా మిగిలిన అమ్మాయిలు నిరాదరణతో, హీనాతి హీనంగా పెంచబడేవారు. వారికి పోషకాహారం వుండేది కాదు. ఆలనా పాలనా, ముద్దూ ముచ్చటా అసలే వుండవు. ఏ వేడుకలూ సరదాలు జరిగేవి కావు. అబ్బాయిల కయితే బారసాల, అన్నప్రాశన, అక్షరాభ్యాసం, పుట్టినరోజు పండుగలలాంటివన్నీ ఘనంగా తాహతుకు మించి జరిపించేవారు. "ఆడది చదివి ఉద్యోగం చేస్తుందా, ఊళ్ళేలుతుందా" అనే సామెత వుండేది. 'ఉద్యోగం పురుష లక్షణం' అంటూ ఇల్లూ, వాకిలి, ఆఖరికి సూత్రం గూడా తెగనమ్మి ఎన్నిసార్లు పరీక్షలలో తప్పినా అబ్బాయి లను చదివించటం నేటికీ జరుగుతున్న ఆచారం. అందుచేత్లే అమ్మాయిలు విద్యకూ, ఉద్యోగాలకు, కోరికలకూ, ఆశయాలకు దూరమై కేవలం ఇంటి పనులకు ఉపయోగ పడే సాధనాలుగా, బిడ్డల్ని కనిపెంచే యంత్రాలుగా మాత్రమే ఉపయోగపడేవారు. ఒక్కమాటలో చెప్పాలంటే వివాహం రిజిష్టరు చేసుకోవాలి అంటే అది కాంట్రాక్టు క్రిందికి వస్తుందని, అది కిరస్తానీ దేశాలకే చెల్లుతుందని, భారతదేశం మహా పవిత్ర మైనదని, వివాహం మరణంతోనే విడిపోతుందంటూ నమ్మే రోజులవి. బాల్యవివాహ

చట్టం 1929 లో అమల్లోకి వచ్చింది. అతి బాల వితంతువులకు, గర్భిణీ స్త్రీ కు 1821 లో సతిని నిషేధిస్తూ బ్రిటిష్‌వారి ధర్మమా అని శాసనం వచ్చింది. రాజారామ్ మోహన్‌రాయ్, బెంటింగ్‌ల సంస్కరణలవల్ల 1858 లో సతీసహగమన నిషేధ చట్టం దేశం మొత్తానికి (వితంతువులందరికీ) వర్తించేలా శాసనం పెట్టారు. ఆ తరువాత 1857 లో పెట్టిన విధవా వివాహ చట్టం కూడా బ్రిటిష్‌వారే ప్రవేశ పెట్టారు. అయినా ఆ చట్టాలు ఈనాటికీ అమల్లోకి రాకపోవటానికి మన ప్రాచీన సంప్రదాయాలు ఇంకా అడ్డుతగులుతూనే వున్నాయి. మన వారికి చట్టాలు, హక్కులు అంటేనే గిట్టను. వాటికంటే ఆచారాలంటేనే వల్లమాలిన అభిమానం. 1857లో జరిగిన సిపాయి తిరుగుబాటు వల్ల రాణి విక్టోరియా భారతీయుల మత విషయాల జోలికి పోవద్దని ఆదేశించింది. ఆ తర్వాత బ్రిటిష్‌వారు భారతదేశంలోని సంస్కరణల గురించి పట్టించుకో లేదు. కాని వారెన్నడూ ఏ సంస్కరణనూ వ్యతిరేకించలేదు. క్రమంగా కొద్దిమంది సంస్కర్తలు ముందుకొచ్చి ఆడవారి పరిస్థితి మార్చాలని ప్రయత్నించటంవల్ల సామాజిక మార్పు అనివార్యమయింది.

ఇది విలువల విప్లవమా అన్నట్టు పాశ్చాత్య ప్రభావం, సాంకేతిక విజ్ఞానం, కాలమాన ప్రభావం ప్రపంచ వ్యవస్థను ఒక్క కుదుపు కుదిపాయి. ఈనాటి మానవుడు చంద్రుడి మీద కాలు మోపాడు. టెస్టుట్యూబు బేబీలను కనుగొన్నాడు. లేబరేటరీలో కృత్రిమ జీవను సృష్టించగలిగారు. ఈ ఊహాతీత మార్పుల్లో మానవ జీవిత విధానమే మారిపోయింది. ఇది కంప్యూటరు యుగమయింది. రోబోట్ మరమనిషి మనిషిచేసే ప్రక్రియలన్నీ చేస్తున్నాడు. ఈ దశలో మనలో, మన సంస్కృతిలో కూడా అనేక మార్పులు వచ్చేయి. ముఖ్యంగా కందుకూరి, గురజాడ, చలం, దుర్గాబాయి లాంటి సంఘ సంస్కర్తలవల్లా, 1975లో వచ్చిన ప్రపంచ మహిళా సంవత్సరం, దశాబ్దం వల్లా ప్రపంచ దేశాల్లో కలిగిన వినూత్న వరవడిలో భారతదేశ స్త్రీలలో సైతం పాత విలువలు మారి కొత్త సంస్కృతి చోటుచేసుకుంది. కనుక ప్రస్తుత పరిస్థితులను అవగాహన చేసుకొని భవిష్యత్ దర్శనం చేద్దాం.

వివిధ రంగాలలో నాలుగున్నర దశాబ్దాల స్త్రీల అభివృద్ధి గురించి ముందుగా చెప్పుకుందాం. స్వచ్ఛంద సంస్థల్లో స్త్రీల శాతం పెరిగింది. గృహిణులుగా వుంటూ ప్రయివేటుగా చదివేవారి సంఖ్య పెరుగుతూ వుంది. సాహిత్యం వ్రాసే స్త్రీలు లెక్కకు మిక్కుటంగా వున్నారు. ఇంట్లో వస్తువులు తయారుచేసి అమ్ముకునేవారు కొందరయితే, ఇళ్ళ వెంబడి తిరిగి అమ్ముకునేవారు మరికొందరున్నారు. ప్రభుత్వం

నుంచి అప్పులు తీసుకుని ఆర్థికంగా లాభించేవారు, చిన్న చిన్న పరిశ్రమలు స్థాపించే వారు, ట్రయినింగు కోర్సులలో చేరేవారు ఒకటేమిటి ఆటల్లో, పాటల్లో, సంగీత సాహిత్య, చిత్రలేఖనాల్లో మున్నెన్నడూ లేనంతగా స్త్రీలు ఈనాడు కన్పిస్తున్నారు. అందాల పోటీల్లో పాల్గొనేవారు అధికమవుతున్నారు. ఒకప్పుడు అసూర్యం పశ్యలుగా వున్న మహిళాలోకం కూపస్థ మండూకాల్లా బ్రతుకుతున్న స్త్రీలు ఈనాడు నాలుగు గోడలు దాటి బైటికొచ్చి సమాజాన్ని ప్రశ్నిస్తున్నారు. మేం చేస్తున్న ఇంటి చాకిరీకి విలువెందుకు కట్టరు? మేమెందుకు కుటుంబ యజమానులంగా చెలామణి కారాదు? మా పిల్లలకు మేమెందుకు సంరక్షకులంగా వుండరాదు? అసలు డబ్బుపెట్టి మొగుళ్ళను కొనుక్కోవాల్సిన గతి మాకేంటి? అధికార పదవుల్లో, డైరెక్టర్లుగా, ఫాక్టరీ మేనేజర్లుగా మేమెందుకు వుండరాదు? మాకేమి తక్కువయింది? టీచర్లుగా, టైపిస్టులుగా, నర్సులుగా మాత్రమే మేము ఎందుకు వుండాలి? మా జీవితమంతా కేవలం ఇంటిపనికి, వంటపనికి, పిల్లల పెంపకానికే వినియోగిస్తున్నాం. ఇది ఘోర అన్యాయం కాదా? అన్ని రంగాల్లో మేమెందుకు సమానత్వాన్ని పొందరాదు అని ప్రశ్నించే దశకు స్త్రీలు ఎదగడం హర్షదాయకం. ఆలోచిస్తే ఇదంతా మహిళల్లో ఒకవిధమైన చైతన్యం పెరిగి వారు అభివృద్ధిపథాన పయనిస్తున్నారని చెప్పటం హాస్యాస్పదం కాదు.

స్త్రీలలో పెరిగిన ఈ కొత్త విజ్ఞానం వల్ల కొన్ని రంగాలలో కొంత మార్పు రాక తప్పలేదు. ఈనాడు విడాకుల రేటు పెరుగుతోందనటానికి కొన్ని కారణాలు వున్నాయి. ఇంతకుముందు చెప్పినట్లు విని, చచ్చినట్లు పడివుండేవారల్లా సొంత ఆలోచనలతో, విద్యా విజ్ఞానాల పెరుగుదలవల్లా బానిసత్వ లక్షణాలు నశించి భర్తలను ఎదురు ప్రశ్నలు వేస్తున్నారు. అందువల్ల భార్యాభర్తల మధ్య సహజీవనంలో ఒక ఊపు వచ్చి తద్వారా మార్పుచెంది భార్యలు ఇమడలేకపోతున్నారు. బైటకొచ్చి బ్రతకగలమనే విశ్వాసంతో విడాకులు తీసుకుంటున్నారు. భరించేవాడు భర్త అనే పదాన్ని అపహాస్యం చేస్తున్నారు. ఆడవారు ఉద్యోగాలు చేసి సంపాదిస్తున్నారు. పుట్టింటి నుండి ఆస్తులు, కట్నాలు తెచ్చుకుంటున్నప్పుడు మేమెందుకు పేరాసైట్సుగా చెలామణి కావాలి అని ఎదురుప్రశ్నలు వేస్తున్నారు. ఈనాటి స్త్రీల చైతన్యంలో ముఖ్యమైనది వివాహ ఎన్నిక. తల్లిదండ్రుల ఆజ్ఞ కాదని తనకు నచ్చినవాణ్ణి, కులమతాతీతమయినా పెళ్ళాడటానికి ముందడుగు వేస్తున్నారు. ప్రేమ వివాహాల రేటు రోజు రోజుకూ పెరుగుతోంది. కష్టనష్టాలకోర్చి వివాహ కేంద్రాలకు పారిపోయివచ్చి నిర్భయంగా పెళ్ళాడి తమ కాళ్ళపై తాము నిలబడుతున్నారు. ఎక్కడ ఏ ఉద్యోగం దొరికినా

పురుషుల ప్రక్కన కూర్చుని తమ ఉద్యోగ ధర్మాలను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు ఏ కోర్సుకైనా, ఏ ఉద్యోగానికైనా, ఎలాంటి ట్రయినింగ్‌కయినా మేమున్నాం, మాకివ్వండి అంటూ ఎగబడుతున్నారు. మున్నెప్పుడూ లేనంతగా వారి వైఖరిలో మార్పు వచ్చింది. ఆఖరికి కూలిమనిషి కాని, అంట్లుతోమే అమ్మాయికాని చదువు రాకపోయినా వారి వేషభాషల్లో గణనీయమైన మార్పు కనపడుతోంది. విడాకా వివాహాలరేటు రోజు రోజుకూ పెరుగుతోంది. బాల్యవివాహాల స్థాయి తగ్గటం గమనార్హం. ఈ మార్పు గమనిస్తుంటే ఇదొకవిధమైన సంధి యుగంగా గోచరిస్తోంది. పూర్తిగా మార్పూ రాలేదు. వెనుకబాటు తనమూ పోలేదు. ఈ సందర్భంగా చైతన్యవంతమైన మరికొన్ని ముఖ్య ఘట్టాలను కూడా తెలిసికొందాం. మా చిన్ననాటి రోజుల్లో అమ్మాయిలు కాళ్ళకు చెప్పులేసుకున్నా కళ్ళకు అద్దాలు పెట్టుకున్నా తిరుగుబోతులు అని ముక్కుమీద వేలేసుకుని ఈసడించేవారు ఈనాటి అమ్మాయిలు హైహీల్సు, నల్లకళ్ళద్దాలు, లాగులూ, చొక్కాలు వేసుకుని, జుట్టు కత్తిరించుకుని తిరుగుతుంటే 'ఆహా! ఆహా!' అంటున్నారు. ఇటీవల బాల్య వివాహాలు తగ్గి, ప్రేమ వివాహాలు, విధవా వివాహాలు, వర్ణాంతర వివాహాలు పెరిగిపోతున్నాయి. అసలు విడాకుల ప్రసక్తి లేకుండా ఎన్నో శతాబ్దాలు గడిచాయి. అలాంటిది ఈనాడు విడాకులు సర్వసామాన్యమయినాయి. ఆనాడు వరకట్న మరణాలు లేవు. అదొక సమస్య కాదు. ఆనాటి కన్యాశుల్కం ఈనాడు అమల్లో లేదు. భార్యను కొట్టడం, వెళ్ళగొట్టడం, మరో స్త్రీ [illegible] ల్యాడటం, స్త్రీలపై హింస ఆచారంగా, సంప్రదాయంగా ఎంతో కాలం గడిచిపోయింది. ఈనాడు భర్త ఇష్టంలేని భార్యను మానభంగంచేస్తే కేసు లేకపోయినా అదొక దుష్ట చర్యగా ప్రతిఘటిస్తున్నారు. పూర్వం విధవరాలికి భరణం వుండేది. ఈనాడు సర్వ హక్కులూ కలిగిన వాటా లభిస్తోంది. హిందూ వారసత్వ చట్టం ప్రకారం తండ్రి ఆస్తిలో అమ్మాయికి వాటా ఇవ్వాలి. వర్ణాంతర, మతాంతర వివాహాలు చెల్లుతాయని శాసనాలు వచ్చాక కులాంతర వివాహాలకు స్త్రీలే పాత్రధారులు, సూత్రధారులు కావటం గమనార్హం. గతంలో స్త్రీలలో అక్షరాస్యత అత్యల్పం. నేడు 20 శాతాన్ని అధిగమించింది. 1950 వరకు భార్యల జీవితాలు, వారి కూలి, వేతనాన్ని యాజమానులనుండి భర్తలే పుచ్చుకునేవారు. ఈనాడు ఉద్యోగినుల్లో కొందరు తామే పుచ్చుకున్నా అది భర్త దోసిట్లోపోసి-బస్సులకు అడగడం జరుగుతున్నా కొంతవరకు మేలే. విద్యావంతుల్లో సైతం మతమూ, అంధవిశ్వాసాలు, మొక్కుబడులూ ఆరోజుల్లో అనంతంగా వుండేవి. బాబాలు, గురువులు, దైవభక్తి పూజలు స్త్రీలలో అత్యధికంగా వుండేవి ఇంకా ఈ విషయంలో మాత్రం చెప్పుకోతగ్గ మార్పు రాలేదు. సమాన పనికి సమాన వేతనం అనే చట్టంవున్నా నాడూ నేడూ

కూడా ఆ పరిస్థితి మారనీ కారణం ఒకే ఒకటి. ఆడది తక్కువ అనే భావం వల్లనే. అది మారాలంటే అంత తేలిక కాదు. ఇది తరతరాల భావదాస్యం; వేల సంవత్సరాల సంప్రదాయం. అది మన నరనరాన జీర్ణించిపోయింది. అందువల్లే మన ప్రయత్నాలు అభ్యుదయం నీరుకారిపోతున్నాయి. అయినా గత 40 ఏళ్ళలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో ఎన్నో మార్పులు వచ్చాయనేది పచ్చి నిజం. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

సామాజిక రంగంలో : 19వ శతాబ్దంలో స్త్రీలు బహిరంగ సభలకు వచ్చే వారు కాదు. సంస్కర్తలు సమావేశపరిచే బహిరంగసభలకు తమ భార్యలను, తల్లులను, అక్క చెల్లెండ్రను తీసుకురావలసిందని కందుకూరి విజ్ఞప్తి చేసి సంచలనం సృష్టించాడు. ఆనాడు బాల్య వివాహాలు జరగటం పరిపాటి. ఈనాడు ఎక్కడో సకృత్తుగా జరుగుతున్నాయి. గత శతాబ్దంలో విధవా వివాహాలు అంటే నిరసనగా చూచేవారు. ఈనాడు అవి హెచ్చు స్థాయిలో జరుగుతున్నాయి. తమ జీవిత భాగస్వామిని తామే ఎన్నుకునే ప్రసక్తి ఆనాడు అసలే లేదు. ఇప్పుడు కొంతమంది స్త్రీలయినా ఆ హక్కును వినియోగించుకుంటున్నారు. పాతకాలంలో విడాకులు అంటేనే హడలెత్తేవారు. ఈనాడు విడాకులు పుచ్చుకున్న స్త్రీని వేలుపెట్టి చూపేవారు అరుదు. విడాకులను, వేరుగా వుండటాన్ని ప్రోత్సహించకపోయినా వాటిని ఖండించడం లేదు. సతీసహగమనం పాతకాలపు ముచ్చటగా మిగిలిపోయింది. కాకపోతే నేనున్నానంటూ అపుడపుడూ దర్శనమిస్తోంది. విధవరాలికి భర్తవాటా పరిమిత హక్కులతో వచ్చేదల్లా ఇప్పుడు ఆమె తండ్రి 'ఎస్టేట్'లో ఆమెకు సర్వహక్కులతో వాటా వచ్చింది.

విద్య : ప్రస్తుతం విద్యారంగంలో స్త్రీల అభివృద్ధి బాగానే వుందని చెప్పుకోవచ్చు. గడచిన శతాబ్దం మధ్యలో స్త్రీల అక్షరాస్యత ఒక శాతం మాత్రమే. విశ్వవిద్యాలయాలలో, కాలేజీలలో, హైస్కూళ్ళలో చదివే విద్యార్థినుల శాతం పెరిగింది. విశ్వవిద్యాలయ దశలోనూ, వృత్తి విద్యాలయాల్లోనూ పెరుగుదల ప్రాథమిక, సెకండరీ దశలలో కన్నా తక్కువ. విద్యవల్ల లాభిం నివారు పట్టణాలలోని మధ్యతరగతి వారయినప్పుడు స్త్రీలలో విద్యావ్యాప్తి చాలా వేగంగా నడిచింది. గణిత శాస్త్రాన్ని అభిమాన విషయంగా తీసుకోవడానికి, ఇంజనీరింగ్ కాలేజీల్లో, మెడికల్ కాలేజీల్లో చేరడానికి స్త్రీలు ఉత్సాహంతో ఉరకలువేస్తూ ముందుకు వస్తున్నారు. వైద్య కళాశాలల్లో 15 శాతం స్త్రీలకు రిజర్వు చేశారు. అది చాలక డొనేషన్లు కట్టి కూడా చదవటం ముదావహం. ఇంకా

బి.ఇడి. కళాశాలలకు ఎగబడటమేకాక విశ్వవిద్యాలయాలలో వున్న ఎస్సీ కోర్సు లో చేరుతున్నారు. పాలిటెక్నిక్ కోర్సులలో యువతులు తరచుగా కన్పిస్తున్నారు. పరిశోధనలలో వారు వెనుకడుగు వేయడం లేదు. రాష్ట్రంలో విద్యార్థినుల సంఖ్య పెరిగింది. శక్తిసామర్థ్యాలు కలిగిన అధ్యాపకులు హక్కుగా రీడర్లు, ప్రొఫెసర్లు అవుతున్నారు. తమ అధ్యయన విషయాలపై సునిశిత దృష్టినీ, మహిళా దృక్పథాన్ని ప్రదర్శిస్తున్నారు. భారత స్త్రీలకు ఇదంతా తృప్తినీ, ఆత్మ సంతృప్తినీ కలుగజేస్తున్నది. కొంతవరకూ ఇది అభ్యుదయమే.

**ఉద్యోగం :** "ఉద్యోగం పురుష లక్షణం" అనే నానుడి మారి ఉద్యోగం స్త్రీ లక్షణం కూడా అని రుజువు చేస్తున్నారు. 30 శాతం ఉద్యోగాలు స్త్రీలకు కేటాయిస్తామన్నప్పుడు తమ ఆధీనంలో వున్న ఉద్యోగాలను జారిపోకుండా కాపాడుకోవడానికి మహిళలు సన్నద్ధులయినారు. తర్వాత ఆ ఉద్యోగాలు పర్మనెంటు అయ్యాయి. ఇంతకుక్రితం ఉపాధ్యాయులు, నర్సులు, స్టెనోగ్రాఫర్లు, టైపిస్టులు, గుమస్తాలలాంటి ఉద్యోగాలతో స్త్రీలు తృప్తిపడేవారల్లా, నేడు బ్యాంకు మేనేజర్లు, డైరెక్టర్లు, డాక్టర్లు, ప్రొఫెసర్లు, హైకోర్టు జడ్జీలాంటి ఉద్యోగాలను ఆక్రమించి తమ సామర్థ్యాన్ని నిరూపిస్తున్నారు.

1981 గణాంక లెక్కల ప్రకారం ఉద్యోగాలలో 21 శాతం మాత్రమే ఉన్న మహిళలు 1991 నాటికి 30 శాతాన్ని దాటి అధిక సంఖ్యలో ఉద్యోగాల కోసం అర్రులు జాస్తున్నారు. 1983లో మహిళా దినోత్సవం జరిగిన రోజున ఎనిమిది మహిళా సంఘాలు కలిసి స్త్రీల ఉద్యోగాల విషయమై కోర్కెల పత్రాన్ని సమిష్టిగా ప్రధానమంత్రికి సమర్పించారు. మారిన పరిస్థితుల దృష్ట్యా ఇప్పుడు స్త్రీలు కేవలం వంట ఇంటికే అంకితమవకుండా ఇంటి బరువు-బాధ్యతలు భరించటానికి ఆర్థికంగా కూడా బాధ్యత వహిస్తున్నారు. గ్రామికస్త్రీలు కూలిపని ద్వారా, చేతివృత్తుల ద్వారా సంపాదిస్తుంటే, మధ్యతరగతి స్త్రీలు కార్యాలయాలలో, కర్మాగారాల్లో ఉద్యోగాలు చేసి గడిస్తున్నారు. ఉన్నత కుటుంబీకులు స్వంత వ్యాపారాల ద్వారా ఆర్జనపరులవుతున్నారు. స్త్రీల సంపాదనపై, ఆదాయంపై, ఆస్తిపై ఆమెదే పెత్తనమని శాసనాలు, రాజ్యాంగం చాటిచెప్తున్నాయి. శాసనాలు ఆ హక్కును, అధికారాన్ని స్వీకరించాయి. కానీ వాస్తవానికి అది విరుద్ధంగా వుంది. ధనవంతురాలైన స్త్రీ, ఆస్తిపరురాలైన స్త్రీ కూడా వాటిని తన ఇష్టంవచ్చినట్లు వాడుకోలేని స్థితిలోనే వున్నది. సంపాదన

విషయం అందుకు భిన్నంగా లేదు. జీతాన్ని, వేతనాన్ని, కూలి డబ్బుల్ని సంపాదించే స్త్రీలు వాటిని భర్తల పాదాలచెంత వుంచి దరిమిలా తమ ఖర్చులకు కొద్ది సొమ్ము ఇమ్మని యాచించే దీన స్థితిలోనే ఇంకా వున్నారు. దీనినిబట్టి చూస్తే పైకి కనబడి నంతగా స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం లేదని తేటతెల్లమవుతున్నది. వుంటే కట్నాల బేరాలు ఎందుకుంటాయి. ఆ తెచ్చిన కట్నంపై ఆమెకెందుకు అధికారం వుండటం లేదు? అని ప్రశ్నిస్తే సమాధానం దొరకదు.



**రాజకీయ రంగంలో :** 1921లో మనకు ఓటుహక్కు వచ్చింది. 21 సంవత్సరాలు నిండిన వయోజనులందరికీ ఓటుహక్కు ఇచ్చినందున బ్రహ్మాండమైన స్త్రీశక్తి వెల్లువికింది. అలా భారత ప్రజానీకంలో సగభాగమైన స్త్రీలు దేశ రాజకీయ పరిణామంలో పాత్ర వహించగల స్తోమత, హక్కు సంపాదించుకున్నారు. అయినా ప్రజా ప్రాతినిధ్యంలో స్త్రీకి తగిన స్థానం లభించలేదనేది నిత్యసత్యం. 1952లో 499 లోక్‌సభ సీట్లలో 22 మంది స్త్రీలున్నారు. 1980 నాటికి 544 ఎం.పి.లలో 28 వుంటే 1985 ఎలక్షన్లలో 544 సీట్లలో 42 మంది స్త్రీలున్నారు. ఆలాగే రాజ్యసభలో 1952లో 216 మందిలో 15 మంది స్త్రీలు, 1976లో 236 మందిలో 24 మంది కన్నా లేరు. 1952 కేంద్ర మంత్రివర్గంలో 26 మంది మగ మంత్రులుంటే, ఒక్క స్త్రీ మాత్రమే మంత్రిగా వుంది. 1984లో 292 అసెంబ్లీ సభ్యుల్లో 10 మంది మాత్రమే స్త్రీలు. 1991లో 40 మంది యం.పి లుగా ఎన్నికయినా ఏనాడూ స్త్రీల ప్రాతినిధ్యం 10 శాతాన్ని మించలేదు. ఆంధ్రప్రదేశ్ నుండి ఎన్నుకోబడిన పార్లమెంటు సభ్యులు 1962, 1967, 1971 లలో వరుసగా 4, 3, 2 గా వున్నారు. ఆ కొద్దిమంది అయినా 1982 నుండి నేటివరకు ఇతరులు గమనించే అంతగా పార్లమెంటులో ప్రసంగాలు చేశారు.



**రాజకీయంగా స్త్రీల చొరవ :** పార్లమెంటులో, శాసన సభల్లో స్త్రీలకు రిజర్వేషన్లు వుండాలా అక్కరలేదా అనేది చర్చకొచ్చినప్పుడు అది వివాదాస్పదమైన ఇష్యూగా మారింది. తర్వాత 'స్త్రీల హోదా' కమిటీ కూడా విషయ సేకరణ చేసి రిజర్వేషన్లపై సర్వే చేస్తే అనుకూలంగా కొందరు, ప్రతికూలంగా మరికొందరు వున్నారనే అభిప్రాయ ప్రకటన వచ్చింది. ఉభయసభల్లో స్త్రీలకు తగిన ప్రాతినిధ్యం లేదని కమిటీ అంగీకరించింది. పార్లమెంటు, శాసనసభ ఎన్నికలలో అభ్యర్థులను ఎంపిక చేసేటప్పుడు స్త్రీలను అభ్యర్థులుగా నిర్ణయించే విషయంలో నిర్దుష్టమైన విధానాన్ని

రాజకీయ పార్టీలు రూపొందించుకోవాలని కమిటీ కోరింది. అయినా పార్లమెంటు, శాసనసభల్లో స్త్రీలకు రిజర్వేషన్లను తిరస్కరించింది. అందుకు తగిన కారణాలను చూపించింది. వారి అభిప్రాయం వాస్తవిక దృష్టితో కూడి దేశ పరిస్థితులకు అనుగుణంగా వుంది. స్థానిక స్వపరిపాలనకు సంబంధించిన ప్రాతినిధ్య సంస్థలలో స్త్రీలకు ప్రత్యేక అవకాశాలు కావాలని కమిటీ అభిప్రాయపడింది. ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం (ఎన్.టి.ఆర్.) 1985లో జిల్లా పరిషత్తుల్లో, మండలాలలో స్త్రీలకు 9 శాతం అధ్యక్ష పదవులను రిజర్వు చేసింది. సామాజిక, ఆర్థిక సమస్యలను పరిశీలించడానికి నియమింపబడే కమిటీలు, కమీషన్లు, ప్రతినిధి వర్గాలలో స్త్రీలకు విధిగా స్థానం ఇవ్వాలని స్టేటస్ కమిటీ సిఫారసు చేసింది.

గత 45 ఏళ్ళుగా ఆంధ్రప్రదేశ్ శాసనసభలో స్త్రీలు నామమాత్రంగా వుంటున్నారు. స్త్రీ శిశు సంక్షేమ శాఖకు మంత్రిగా స్త్రీని నియమించే ఆచారం మాత్రం వుంటున్నది. అడపాదడపా ఇతర శాఖలలో కంటితుడుపు చర్యగా ఆడమంత్రులను నియమిస్తున్నారు. ప్రాధాన్యతగల నిర్ణాయక స్థానాలను స్త్రీలు ఆక్రమించడం ఏనాడూ జరుగలేదు. ఆంధ్రప్రదేశ్ మహిళలు తమ హక్కుల కొరకు, తమ శ్రేయస్సు కొరకు రాజకీయమైన పోరాటాన్ని సాగించటానికి ఇంతవరకూ తాముగా సిద్ధపడలేదు అలా చేయలేదు. ఇది గుర్తుంచుకోవలసిన అంశం.

ఏదిఏమైనా ఈనాడు స్త్రీలలో రాజకీయ చైతన్యం పెరిగింది. వారు ఓటు వేస్తున్నారు. ఎన్నికలలో ప్రచార కార్యభారాన్ని మోస్తున్నారు. అభ్యర్థులుగా నిలబడుతున్నారు. శాసనసభకు, పార్లమెంటుకు ఎన్నుకోబడుతున్నారు. పోరాటాలలో, ఆందోళనలలో పాలుపంచుకుంటున్నారు. రాజకీయ స్వభావం కలిగివున్న పోరాటాలను బలపరుస్తున్నారు. మహిళాభ్యుదయ సంస్థల్లాంటి అభ్యుదయకర సంస్థలు 'స్త్రీల అధికార పోరాట వేదిక'లు కూడా నిర్వహించడం స్త్రీల పరంగా చెప్పుకోదగిన రాజకీయ అభివృద్ధి.

**స్త్రీల పోరాటాలు :** 1948 నుండి 51 వరకు జరిగిన తెలంగాణా పోరాటంలో స్త్రీలు అగ్రభాగాన నిలిచి పోరాడారు. ఊరేగింపుల్లో అగ్రభాగాన వుండేవారు. సత్యాగ్రహాలు చేశారు. సభలు, సమావేశాలు జరిపారు. ఈ పోరాటంలో వారు భూమికోసం పోరాడారు. ఐలమ్మ పేరు తిరుగుబాటుకు మారుపేరు అయింది. ధనవంతులూ, సంపన్నులూ అయిన భూస్వాములపై బీదల పోరాటానికి ఆమె ప్రతీకగా నిలిచింది.

ఆమె ధైర్యం ఇతర స్త్రీలలో ఉత్తేజాన్ని పురికొల్పింది. వారు ఆమె మార్గాన్ని అను సరించారు రోజురోజుకూ స్త్రీలకు ఉద్యమంపై ఆసక్తి పెరిగింది ప్రతిఘటనకు పూనుకునే స్త్రీల సంఖ్య అనేక వందలలో ఉండేది. పైగా పట్టుదల వారి సొమ్ము. అందువల్లనే వారికి విజయాలు లభించేవి రజాకార్లతో, నిజాం పోలీసులతో, మిలటరీతో పోరాటాలు సాగించినపుడు దుష్టశక్తులు అణచివేతకు, దౌర్జన్యానికి స్త్రీలను ఎంపిక చేసుకునేవారు. గ్రామంలో మిలటరీవారు స్త్రీలను ఎత్తుకునిపోవడానికి ప్రయత్నించి నప్పుడు గ్రామంలోని స్త్రీలందరూ మిలటరీ వ్యానును చుట్టుముట్టి కదలనీయక వారి అక్కచెల్లెండ్రను రక్షించుకున్నారు రాజకీయ చైతన్యంగల చాలామంది స్త్రీలు కొరియర్లుగా పనిచేశారు, షెడ్యూల్డు జాతుల స్త్రీలు కూడా వార్తాహరులుగా పనిచేసి తెలంగాణా ఉద్యమానికి ఎనలేని సేవ చేశారు. ఆ సందర్భంగా రాములమ్మ పేరు విస్మరించరానిది. సావిత్రమ్మ ఒక కొరియరుగా పనిచేసింది. ప్రతిఘటన దళాలు ప్రత్యేకంగా కాపలా దళాలను నిర్మించవలసి వచ్చేది. ఆ పనిలో స్త్రీలు ప్రముఖమైన పాత్ర నిర్వహించారు. తమ తమ ధన మాన ప్రాణాలకు ప్రమాదమున్నప్పటికీ దళ నాయకులకు, ప్రాంతీయ నాయకులకు, కేంద్ర కమిటీ సభ్యులకు రక్షణ ఇచ్చే బాధ్య తను ఐచ్ఛికంగా స్త్రీలు చేపట్టారు. సుందరయ్యను కాపాడే నిమిత్తం ఒక గర్భిణీ స్త్రీ తెల్లవార్లూ కాపలా కాసింది. ధైర్య సాహసాలతో స్త్రీలు ఆహార సముపార్జన చేసి దళాలకు తిండి పెట్టకుంటావుంటే పోరాటం పూర్తిగా సాగేది కాదు. ఈ విషయంలో వారి పాత్ర చిరస్మరణీయం. జెనాబీ రాజారాం, వెంకమ్మ, వడెగపాటి నాగమ్మ, బెండలపూడికి చెందిన బూదెమ్మ తమ సేవలందించారు ధైర్య సాహసాలుగల స్త్రీలు గెరిల్లాలుగా ముందుకు దూకారు. వీరిలో ఎక్కువమంది కోయ స్త్రీలు. కోయ లచ్చక్క స్టెన్‌గన్‌తో నలుగురు పోలీసులను చంపింది. అదే పోరాటంలో ఆమె తన ప్రాణా లర్పించింది. నల్గొండ జిల్లాకు చెందిన రాములమ్మ, రంగమ్మ, తిరుపతమ్మ నరసమ్మ వెంకటమ్మ లాంటివారు గెరిల్లాలలో ముఖ్యులు. మల్లు స్వరాజ్యం ఆయుధం పట్టింది. కోయవారిని సంఘటిత పరచింది. ప్రాంతీయ కమిటీ సభ్యురాలయింది. ఎంతోమంది స్త్రీలు మిలటరీవారి చేత చిత్రహింసలకు, మానభంగాలకు, లాఠీచార్జీలకు గురైనారు. అయినా పోరాట పటిమ నశించనందువల్లనే స్త్రీలు ధైర్యంగా నిలబడ్డారు. మొదట్లో సంఘానికి, తర్వాత పార్టీకి అండగా నిలిచారు. ప్రదర్శనలలో వేల సంఖ్యలో స్త్రీలు పాల్గొన్నారు. పసిపిల్లల తల్లులు, గర్భిణీ స్త్రీలు, వృద్ధ మాతలు, బాలికలు కాలినడ కన బారులు తీర్చి నడిచారు. వారిలో వచ్చిన చైతన్యానికి ఇది ఒక ప్రతీక.

1962లో అదనపు భూమిపన్ను వేస్తే దానికి వ్యతిరేకంగా వచ్చిన ఆందోళనలో కమ్యూనిస్టు మహిళలు తమ వంతు బాధ్యతను నెరవేర్చారు. న్యాయం కోసం, ధర్మం కోసం గిరిజనులు సాగించిన శ్రీకాకుళం పోరాటంలో స్త్రీలు పాల్గొన్నారు. చిత్రహింసలకు గురిఅయినా వారు నాయకుల రహస్యాలను బయటపెట్టలేదు. స్త్రీలు కొరియర్లుగా పనిచేశారు. ధైర్యసాహసాలు కల కొందరు స్త్రీలు గెరిల్లా దళాలలో చేరారు. అనేక ఉద్యమాలలో స్త్రీలు పురుషులను అనుసరించారు. వారి ప్రయత్నాలలో వారు విశ్రాంతి ఎరుగరు. ధైర్యం, త్యాగం, కృతనిశ్చయంలాంటి సద్గుణాలలో వారు పురుషులకు తీసిపోలేదు.

## ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమంలో స్త్రీల పోరాటపటిమ :

అది అక్టోబరు 1972. అంతకు క్రితం నైజాంలోవున్న ముల్కీ నిబంధన తెలంగాణాలో చలామణి కావచ్చని సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చిన సమయంఅది. నైజాం ప్రాంతంలో 12 సంవత్సరాలు స్థిరనివాసం వున్నవారికి, అక్కడ పుట్టినవారికి మాత్రమే ఆ సంస్థానంలో ఉద్యోగాలు ఇవ్వాలనే నవాబు ఫర్మానాను ముల్కీ అని పిలిచేవారు. నవాబు పరిపాలన పోయింది. హైదరాబాదు రాష్ట్రం ఏర్పడింది. తరువాత అది విచ్ఛిన్నమై ఆయా భాషాప్రాంతాలు పొరుగునవున్న ఇతర రాష్ట్రాలతో కలిసి పోయాయి. ఆ క్రమంలో 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరించింది. తరువాత ఒక రాష్ట్రంలో ఒక ప్రాంతంలో ముమ్మందుగా ఉద్యోగాలు ఇవ్వవచ్చునా అని పేచీ వచ్చినప్పుడు రాష్ట్రంలో ఒక భాగానికి ఇలాంటి నిబంధన చెల్లదని హైకోర్టు తీర్పు ఇచ్చింది. దానితో తెలంగాణా విడిపోవాలని 1969లో ఆ ప్రాంతంవారు ఉద్యమం నిర్వహించారు. కేసు సుప్రీంకోర్టు కెళ్ళింది. లోగడ ఇచ్చిన హైకోర్టు తీర్పు రాజ్యాంగ విరుద్ధంకాదని 1972లో సుప్రీంకోర్టు తీర్పు వచ్చింది. తత్ ఫలితంగా కోస్తాలో, రాయలసీమలో నివాసముంటున్న ఆంధ్రులకు తెలంగాణా జిల్లాలలోను, హైదరాబాదులోను ఉద్యోగావకాశాలు మృగ్యమయినాయన్న మాట. ఇక జ్వాల ముట్టుకున్నది. ఆంధ్ర ఉద్యోగులు, విద్యార్థులు, మహిళలు రంగంలోకి దూకారు. అంతకు పూర్వం ఎన్నడూ స్పందించని ఆంధ్రస్త్రీలు ఈ దురన్యాయానికి ఆగ్రహావేశపరులై రైళ్ళు ఆపారు, ప్రభుత్వ కార్యాలయాల ముందు పికెటింగులు నడిపారు. విమానాలు దిగకుండా ఆపటానికి సాహసించారు. ఊరేగింపులో అగ్రభాగాన నిలబడేవారు. బాలింతలు, పాలసీసాలతో పసిపిల్లల తల్లులు, గర్భిణీస్త్రీలు, ముసలమ్మలూ తమంత తాముగా, స్వచ్ఛందంగా రంగంలోదూకి, రోజువారి కార్యక్రమాల్లో విధి

పికాము లేకుండా పాల్గొనేవారు. పోలీసు స్టేషన్ల మీద, ప్రభుత్వ కార్యాలయాల మీద జెండాలు ఎగురవేసేవారు. దాదాపు రోజూ 10, 15 మంది స్త్రీలు అరెస్టు అయ్యేవారు. కొన్ని రోజుల్లో 4, 5 వందల మంది స్త్రీలను అరెస్టుచేసి, అన్నం పెట్టకుండా ఊరికి 7, 8 మైళ్ళ దూరాన దింపి వచ్చేవారు. విద్యార్థులను, యువకులను వదలిపెట్టకుండా స్త్రీలను మాత్రం సాయంత్రానికి విడిచేసేవారు పోలీసులు. అప్పుడు మహిళలంతా ఏకమై జైలునుండి విడుదలచేస్తే, అందర్నీ వదలండి లేదా మేమూపోము. వారూ, మేమూ అంతా చేసిననేరం ఒకటే అయినప్పుడు వారిని నిర్బంధంలో ఎందుకుంచుతారు. మేము పోతే వారిని కొట్టి చంపుతారు. అంటూ పోట్లాడి యువతను కూడా తమతో తెచ్చేవారు.

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం తేవాలనే పట్టుదలలో మొదటి రాష్ట్ర మహిళా సదస్సు తిరుపతిలో జరిగింది. 11 జిల్లాలనుండి వెయ్యిమంది డెలిగేట్లుగా హాజరయినారు. బహిరంగసభకు 50 వేల దాకా స్త్రీ పురుషులు వచ్చారు. అలాగే విజయవాడలో రెండవ రాష్ట్రసభకు డా॥ సరోజిని రామారావు, విశ్వసుందరం, మల్లాది సుబ్బమ్మ అధ్యక్ష వర్గంగా వ్యవహరించారు. ఏప్రియల్ 73న రాజమండ్రిలో తృతీయ రాష్ట్ర మహిళా మహాసభను మహిళలు సమర్థవంతంగా నిర్వహించటంవల్ల తీర్మానాలు ఘాటుగా రాయటంవల్ల రాష్ట్ర మహిళలకు గొప్ప పేరు ప్రఖ్యాతులు వచ్చాయి; ఉద్యమం తారాస్థాయికి పెరిగింది. అలా 72 అక్టోబరు నుండి 73 ఏప్రియల్ వరకు మహా ఉధృతంగా జాతీయ స్వాతంత్రోద్యమ స్థాయికన్నా మిన్నగా సాగిన ఉద్యమ ఉధృతం కొన్ని కారణాలవల్ల సన్నగిల్లి పోయింది. మానవవాదులుగా అభివర్ణించుకుంటున్నవారుకూడా ఒక ప్రాంత ప్రజల ప్రత్యేక ఉద్యమంలో పాల్గొనడం సబబేనా అనే విమర్శ వచ్చింది, హ్యూమనిస్టులకు భాషా ప్రాంత విభేధాలు వుండవుకాని సమరస భావంతో జీవించలేనప్పుడు అన్నతమ్ముల్లా విడిపోయి తర్వాత సోదరంగా జీవించవచ్చుకదా అనే విశ్వాసంతో అశేష త్యాగాలు చేశారు. జయాపజయాలు గురించి బాధపడలేము మహిళలు. కాని ఆనాటి స్త్రీల ఆ పోరాటం అనన్యం. అద్వితీయం అనక తప్పదు.

**శాసనాలలో వచ్చిన పురోగతి :** హిందూ సనాతన వర్గాల వ్యతిరేకత మూలంగా హిందూ ధర్మ శాస్త్రాన్ని పూర్తిగా మార్చలేకపోయినా దానిని ముక్కచెక్కలుగా మార్చింది కేంద్రప్రభుత్వం. 1956 నుండి హిందూ స్త్రీ అభివృద్ధికి ప్రగతిపథాన పయనించే శాసనాలు చాలా వచ్చాయి. ప్రత్యేక వివాహ శాసనం

1954లో అమల్లోకి వచ్చింది. క్రొత్త చట్టం ప్రకారం 21 సం॥లు నిండిన పురుషుడు, 18 సం॥రాలు నిండిన స్త్రీ ఏదో ఒక మతానికి చెందినవారైనా లేక ఏ మతానికి చెందకపోయినా రిజిష్ట్రారు ఎదుట వివాహమాడవచ్చు. అంతేకాదు, స్త్రీ పురుషులు 21 సం॥రాలు నిండివుండి అంతకుముందే వివాహమాడి ఆనాటివరకు భార్యాభర్తలుగా కలిసి వుంటుంటే అప్పుడు కూడా పెళ్ళి రిజిస్టరు చేసుకోవచ్చు. ఇది పూర్వపు చట్టం కన్నా పెద్ద ముందడుగు. విడాకులకు కూడా ఈ శాసనంలో ఏర్పాటు వుంది. 1955 లో కేంద్రం హిందూ వివాహ శాసనం చేసింది. దీని ప్రకారం ఏక భర్తృత్వ, ఏక భార్యాత్వ కుటుంబాలు ఏర్పడాలి. కోర్టు ద్వారా వేరుగా వుండటానికి (Judicial Saparation) కాపురానికి పొమ్మని ఉత్తర్వు (Restitution of Conjugal Rights) ఉత్తరువు, విడాకులు అన్నీ ఇందులో పొందుపరచబడినాయి. మనోవర్తి, విడిపోయిన దంపతుల సంతాన రక్షణ, పోషణా బాధ్యతలు ఈ శాసనం క్రమబద్ధం చేస్తున్నది. ఈ శాసనం చాలా అభ్యుదయకరమని నిస్సందేహంగా చెప్పవచ్చు.

1956లో హిందూ దత్తత, మనోవర్తి శాసనం కేంద్రం చేసింది. ఇది దత్తతను గురించిన ధర్మ శాస్త్రాలను క్రోడీకరించింది. మనోవర్తి అంటే తల్లి దండ్రులు, సంతానం, భార్యాభర్తలు వీరందరి మనోవర్తికి సంబంధించిన చట్టాన్ని ఇందులో పొందుపరిచారు. 1956లోనే కేంద్రం హిందూ మైనారిటీ, సంరక్షకత్వ శాసనంకూడా చేసింది. ఇది ప్రయోజనకరమైనా స్త్రీలకు పెద్దగా ఉపకరించలేదు. 1956లో వచ్చిన మరో కేంద్ర శాసనం అవినీతికర వ్యాపార నిర్మూలన శాసనం. (Suppression of Immoral Trafic Act) పడుపు గృహాలను నడపటం, వాటి నిర్వహణకు సహాయపడటం ప్రోద్బలం చేయడం నేరాలయినాయి. కానీ వ్యభిచారి ణుల సొత్తును ఆశించే పురుషులకు శిక్షలేకుండా స్త్రీలకే శిక్షపడుతున్నది. కనుక ఈ చట్టం స్త్రీలను వివక్షాపూర్వకంగా శిక్షిస్తున్నదని పేర్కొనవచ్చు. తర్వాత పురుషులను కూడా నేరస్తులనుగా చేసే చట్టం వచ్చింది. 1961లో వరకట్న నిషేధ శాసనం అమలులోకి వచ్చింది. వరకట్న నిషేధం జరగాలని భారత స్త్రీలు చేసిన డిమాండును పురస్కరించుకుని ఇది పుట్టింది. కానీ భారతదేశ ప్రజల భావనలు, చట్టంలోని లోపాలు రెండూ కలిసి ఈ శాసనానికి పురిటిలోనే సంధి కొట్టేలా చేశాయి. దీనికి మహిళా సంఘాలు ఇటీవల అనేక సవరణలను సూచిస్తున్నాయి. పార్లమెంటులో 1980, 84, 86లో అనేక సవరణల బిల్లు వచ్చింది.

1961లో వచ్చిన మాతృత్వ సౌకర్యాల శాసనంవల్ల కార్మిక స్త్రీకి జీతంతో ఆరువారాలు పురిటి సెలవులు లభిస్తున్నాయి. అలాగే గర్భస్రావ చట్టం 1971లో వచ్చింది. దీనివల్ల కొన్ని అనివార్య సంవర్భాలలో ప్రభుత్వం లేక ప్రైవేటు డాక్టర్లు గర్భస్రావానికి పూనుకోవడానికి వెసులుబాటు కల్పిస్తుంది. ఈ శాసనం రాకముందు రహస్యంగా గర్భస్రావాలు చేయించుకోవలసి వచ్చేది. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో డాక్టరు గర్భస్రావం చేయవచ్చుగానీ అందుకు ఆ స్త్రీ యొక్క అనుమతి వుండాలి. ఇది స్త్రీ స్వేచ్ఛకు అభ్యుదయకరమైన శాసనం. సమానమైన ప్రతిఫలపు శాసనం 1976లో వచ్చింది. సమానమైన పనికి సమానమైన వేతనం ఇవ్వాలనే, ఉద్యోగ విషయంలో స్త్రీ పురుష వివక్ష ఉండరాదనేది ఈ శాసనం యొక్క మౌలిక సూత్రం. 'మధురా' కేసులో సుప్రీంకోర్టు తీర్పువల్ల జాగృతి చైతన్యంకల మహిళా కార్యకర్తలు ఆందోళన చెంది తమ సంఘాల ద్వారా నిరసన తెలిపారు. వారి ఆందోళన ఫలితంగా "క్రిమినల్ లా" సవరణ కొరకు కేంద్ర ప్రభుత్వం ఒక బిల్లును ప్రవేశ పెట్టింది. 1983లో వచ్చిన క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 2 సవరణ శాసనం ప్రకారం భార్యపై భర్త జరిపే హింసకు 3 సంవత్సరాలు శిక్ష అని నిర్ణయించబడింది. పెళ్ళయిన 7 సం॥లలోపు భార్య ఆత్మహత్య చేసుకుంటే భర్త లేక అతని బంధువులు ఆమెను హింసించినట్లు రుజువు అయితే భర్తకు, అతని తరపువారికి ఆత్మహత్యకు దోహదం చేసినట్లు ఎంచబడి, శిక్షలు వేయబడతాయి.

హిందూ స్త్రీలకు పురుషులతో సమానంగా జన్మతః వచ్చే ఆస్తిహక్కు కొరకు ఒక బిల్లును ఆంధ్రప్రదేశ్‌లో 18-3-1983న ప్రవేశపెట్టారు. కుమారునికి ఎలాంటి ఆస్తిహక్కులున్నాయో కుమార్తెకు కూడా అలాంటి హక్కు ఇస్తుంది ఈ చట్టం. చనిపోయిన కుమారుని సంతానానికి పిత్రార్జితపు ఆస్తివాటా వున్నట్లే, చనిపోయిన కుమార్తె సంతానానికి కూడా వాటా ఇస్తుంది ఈ బిల్లు. 1956లో హిందూ వారసత్వ విధానంలో ఆమోదింపబడిన చట్టాన్ని ఈ బిల్లు సవరణ చేస్తుంది. ఆస్తిహక్కు వల్ల స్త్రీకి కొంత రక్షణ, ఆత్మస్థయిర్యం వస్తుంది. ఇది కేవలం హిందూ మహిళకే చెల్లుతుంది. కాని ముస్లిం, క్రైస్తవ మహిళలకు కూడా ఈవిధమైన వారసత్వ హక్కు చెందాలని మహిళాభ్యుదయ వాదులు విన్నపాలు పంపడం జరిగింది. ఈ బిల్లు 1985 లో చట్టరూపమయింది. గెజెట్‌లో ప్రకటింపబడిన తర్వాత 5-9-1985 తేదీ నుండి అమల్లోకి వచ్చింది. హిందూ శాసనాల్లో వచ్చిన అభివృద్ధి తెలుసుకున్నాం కాని ముస్లిం 'లా' సవరణలు 1939 తర్వాత జరుగలేదు. క్రైస్తవ వివాహ శాసనం

1972, వివాకుల శాసనం 1869 నాటివే ఈనాటికీ చలామణి అవుతున్నాయి. మార్పులు లేవు. కనుక క్రైస్తవ, ముస్లిం శాసనాల వివరణ వ్రాయలేదు.

**సాంస్కృతిక రంగంలో :** సంగీతం, సాహిత్యం, నాట్యం, చిత్రకళ, నటన, ఆటలు మొదలైనవన్నీ మన సంస్కృతిలో భాగాలే. ఇవన్నీ మనిషిని ఎదుర్కొనే నిత్య జీవిత కల్లోలాల నుంచి కొంతసేపు మనసుకు ఆహ్లాదాన్ని కలిగించే సాధనాలు. వీటిలో అభిరుచి వున్న వారు అందులో కృషి చేసి ఉన్నత స్థానాన్ని సాధించి మానసిక తృప్తి పొందుతారు. ఒకప్పుడు నాటక, సినిమా రంగాల్లో, క్రీడా రంగంలో స్త్రీలు అంతంత మాత్రంగా వుండేవారు. ఇప్పుడు విరివిగా ముందుకు వస్తున్నారు. విశిష్ట రంగాల్లో కొందరు స్త్రీలు ఉన్నత స్థానాలను ఆక్రమించారు. ముఖ్యంగా కేసరిగారి ఆధ్వర్యంలో స్థాపింపబడిన తెలుగు మాసపత్రిక 'గృహలక్ష్మి'లో రచనలవల్లా ఇంకా ఆంధ్ర మహిళల సేవా ఫలితంగా అనేకమంది రచయిత్రులు ఉద్భవించారు. ప్రసిద్ధ స్వాతంత్ర్యోద్యమ కార్యకర్త రాజ్యలక్ష్మమ్మ 'తెలుగుదేశం' అనే పత్రికను స్థాపించింది. వట్టికొండ విశాలాక్షి 'ప్రజావాణి' పత్రికను నెలకొల్పారు. ఈ దశాబ్దంలో స్త్రీ పాఠకులకు రెండు రకాల పత్రికలు అందుతున్నాయి. స్త్రీలచేత ప్రచురించబడి, స్త్రీల యాజమాన్యంలో నడుపబడే పత్రికలు- వికాసం, జ్యోతి, వి. కోటేశ్వరమ్మగారి ఆధ్వర్యంలో ఇల్లూ-ఇల్లాలు, స్త్రీ స్వేచ్ఛ పత్రికలు ఈ కోవకు చెందుతాయి. కేవలం స్త్రీల కోసం ఉద్దేశింపబడిన వనిత, వనితాజ్యోతి, మహిళ, కలువబాల పత్రికల లాంటివి రెండోరకం వాటిని పురుషులే నిర్వహిస్తున్నారు.

సాహిత్యం స్త్రీల దృష్టిని విశేషంగా ఆకర్షించింది. గత రెండు దశాబ్దాలుగా రచయిత్రుల సంఖ్య విపరీతంగా పెరిగింది. ఈ దశాబ్దంలో ఇంకా వేగం పుంజుకుందని మనకు తెలుసు స్త్రీల ప్రయోజనాన్ని ఆశించి వ్రాసేవారు చాలా తక్కువ సంఖ్యలో వున్నారు. వారు రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి, మాలతీ చందూర్, కె. రామలక్ష్మి, మల్లాది సుబ్బమ్మ, ఓల్గా ప్రభృతులు. స్త్రీ విమోచనకు, ఏదోఒక రకమైన మానవవాదానికి అంకితమైన రచయిత్రులుగా వీరు పేరెన్నికగాంచినవారని పేర్కొనవచ్చు.

క్రీడారంగంలో కూడా స్త్రీలు ఎంతగానో అభ్యుదయం సాధించారు. స్త్రీల హాకీ టీములు, వాలీబాల్ టీములు, బ్యాడ్‌మింటన్ టీములు అనేకం వుంటున్నాయి. అంతర్జాతీయ పోటీలలో మన దేశానికి స్వర్ణపతకాన్ని సాధించిపెట్టింది స్త్రీ అనే

విషయం మరువకూడదు. పరుగు పందాలలో అంతర్జాతీయ పోటీలలో ముందడుగు వేస్తున్న భారత మహిళలు లేకపోలేదు. ఇంతకుముందు కేవలం నటీమణులుగానే వుండే స్త్రీలు ఇప్పుడు దర్శకులుగా, నిర్మాతలుగా, కథకులుగా, కెమెరా ఉమెన్‌లుగా రాణిస్తున్నారు. ఇది గత కాలపు స్థితికన్నా ఈనాడు అభ్యుదయంలో పయనించడం గమనార్హమైన మార్పు.

**స్టేటస్ కమిటీ రిపోర్టు :** గత అర్థ శతాబ్దంలో జరిగిన ముఖ్య సంస్కరణలు, అభ్యుదయ లక్ష్యాలు ఈ సందర్భంగా చెప్పటం అనౌచిత్యం కాదు. దేశ స్వాతంత్ర్యానంతరం భారత స్త్రీల పరిస్థితి పరిశోధనకై ఫూల్‌రేణుగుహా, వీణా మజుందార్ల ఆధ్వర్యంలో స్త్రీ స్టేటస్ కమిటీని నియమించింది భారత ప్రభుత్వం. వారి పరిశోధనాకాలం మూడు సంవత్సరాలు పట్టింది. ఖర్చు తొమ్మిది లక్షల యాభై వేల రూపాయలు అయింది. చట్టరూపంలోవున్న హక్కులు స్త్రీలు అనుభవించలేని అజ్ఞాన దశలో వున్నారని, స్త్రీ విద్యపై విముఖతవల్ల 290 మిలియన్ల స్త్రీ శక్తి నిరుపయోగమవుతోందని ఇది ఇలాగే కొనసాగితే దేశ భవిష్యత్తునే తారుమారు చేస్తుందని, కుటుంబ విచ్ఛిత్తి అయ్యే ప్రమాదం కూడా వుందని స్టేటస్ కమిటీ రిపోర్టులో రాశారు. వారు 86 సిఫారసులతో ఒక నివేదికను 1975 లో సమర్పించారు. ఈ సర్వే చాలా అద్వితీయం, అపూర్వం అని చెప్పక తప్పదు. అయినా ఏ రెండు, మూడు కన్నా ఎక్కువ అమలుపర్చలేకపోయింది ప్రభుత్వం. ఇప్పటికయినా ఆ సిఫార్సులను అమలుపర్చటం ప్రభుత్వ ముఖ్య కర్తవ్యం. ఇది యావత్ భారతదేశానికి కూడా వర్తిస్తుందనేది నగ్నసత్యం.

**మహిళా దశాబ్దం :** శాంతి, అభివృద్ధి మార్గాన ప్రజలను, దేశాన్ని మళ్ళించాలని, దీనికి మహిళా శక్తిని వినియోగించాలని, తద్వారా ప్రపంచ శాంతిని సంరక్షించాలని ఐక్యరాజ్యసమితి 1975 ను మహిళా సంవత్సరంగా ప్రకటించింది. ఈ సందర్భంగా ప్రపంచం మొత్తం మీద సభలు, సర్వేలు, చర్చలు, సెమినార్లు భారీఎత్తున జరిగాయి. అయినా ప్రపంచ స్త్రీలలో చెప్పుకోదగ్గంత విజ్ఞానం, వివేకం కలుగలేదు. కానీ ఈ సంవత్సరంలో చెప్పుకోదగ్గ మూడు ప్రపంచ మహాసభల్లో మొదటి రెండూ మెక్సికోలోనూ, మూడవది బెర్లిన్‌లోనూ జరిగాయి. కానీ తరతరాల స్త్రీల అణచివేత, లొంగుబాటుతనం, భావదాస్యం ఒక్క సంవత్సరంలో నిర్మూలించడం అసాధ్యం అని తెలిసిపోయింది. తిరిగి 1976 నుండి 1985 వరకు మహిళా దశాబ్దాన్ని ఐక్యరాజ్య

సమితి వారు డిక్లేర్ చేశారు. ఈ సందర్భంగా 1980 లో కోపన్ హాగెన్‌లో జరిగిన సభలో మహిళాభ్యుదయానికి అవసరమైన చర్యలను ఏ ఏ దేశాలు ఎంతవరకు తీసుకున్నాయో సమీక్షించడానికి ఈ సభ ఉద్దేశించబడింది. విద్యా, వైద్య, ఉద్యోగ రంగాలలో స్త్రీ పురోగతిని గురించి స్పష్టంగా, నిర్దుష్టంగా నివేదికలు సమర్పింపబడి అవి చర్చలకు ప్రాతిపదికలుగా నిలిచాయి. స్త్రీలు సాధించింది బహు స్వల్పం అని సాధించవలసింది అత్యధికంగా వున్నదని కోపెన్‌హాగన్ సభ రుజువు చేసింది.

మహిళా దశాబ్ది ముగింపు మహాసభలు కెన్యా రాజధాని నైరోబీలో జరిగాయి. 160 దేశాల నుంచి 13 వేలమంది ప్రతినిధులు హాజరయి తమ, తమ సమస్యలను చర్చించడం ఈ సభల ప్రత్యేకత రెండువేల సంవత్సరాల నాటికి స్త్రీల విముక్తికి, అభ్యుదయానికి సంబంధించిన "భవిష్యత్ వ్యూహాలు" అనే మార్గదర్శక సూత్రాలను రూపొందించడం ఈ అంతర్జాతీయ సదస్సు యొక్క ముందడుగు. మున్నెన్నడూ చర్చకురాని ఒక నూతనాంశాన్ని అంటే గృహిణుల ఇంటి పనికి, వంట పనికి ఆర్థిక విలువ అంటే వేతనాన్ని నిర్ణయించాలని ఈ సభవారు డిమాండ్ చేశారు. స్త్రీలు ఇంట్లో కూర్చుని చేసే పనికి విలువేముంది అని వెక్కిరించే స్త్రీ శ్రమకు ఈ మహాసభ విలువ కట్టింది. ఇలాంటి విషమ సమస్య ఒకటి వుందని ప్రపంచ పౌరుల ముందుకు తెచ్చి స్త్రీ గౌరవాన్ని నిలబెట్టింది. ఆమె 'పేరాసైట్' కాదని స్థిరీకరించింది ఈ మహాసభ.

మహిళా దశాబ్ద ప్రకటన భారతదేశ స్త్రీలలో మహత్తర జాగృతిని కలుగజేసింది. ఆ విషయంలో ఆంధ్రప్రదేశ్ కూడా ప్రతిభావంతమయింది. అందువల్లే వరకట్న మరణాలు, స్త్రీల వేధింపులు, అత్యాచారాలు, మానభంగాలు జరిగినప్పుడు స్త్రీలు ఎక్కువగా ప్రతిఘటిస్తున్నారు. స్త్రీల వ్యక్తిత్వంపైనా వారి సమస్యలపైనా రచయిత్రులు కథలు, నవలలు మిక్కుటంగా వ్రాస్తున్నారు. ఈ చైతన్యంవల్ల గృహిణులు కూడా సంపాదక లేఖలు, వ్యాసాలు వ్రాయడం పెరిగింది. తెలుగు, ఇంగ్లీషు తదితర భాషల దినపత్రికలు మహిళా సమస్యలు చర్చించటానికి వారానికి ఒకరోజు పూర్తి పుటను కేటాయించడం జరిగింది. దరిదాపు స్త్రీల శీర్షిక లేని పత్రికలే లేకపోవడం స్త్రీల జాగృతికి నిదర్శనం. స్త్రీల పరిస్థితిలో విప్లవకరమైన మార్పులు తీసుకురావడానికి మహిళా దశాబ్దం ఉపకరించకపోయినా వారిలో జాగృతి, చైతన్యాన్ని పెంపొందించడంలో అది మహత్తరంగా దోహదం చేసింది. ఈ సందర్భంగా జరిగిన కొన్ని మహత్తర సంఘటనలను వాటి రియాక్షన్స్‌నూ ఇక్కడ చెప్పక తప్పదు.

**అమానుష చర్యలపై ప్రతిఘటనలు :** ఇండోర్‌కు చెందిన షాబానోకు అహమ్మద్‌ఖాన్‌తో 1932 లో వివాహమయింది. ఐదుగురు పిల్లలు కలిగారు. 50 ఏళ్ళ వయస్సులో ఈమెను భర్త వెళ్ళగొట్టాడు, భరణం క్రింద నెలకు 500 రూపాయలను ఇమ్మని ఈమె మెజిస్ట్రేట్ కోర్టులో పిటీషన్ పెట్టింది. ఆ కోర్టులో నెలకు 25 రూ. ఇమ్మని తీర్పు వచ్చింది. భర్త ఆమెకు 1975లో తలాఖ్ ఇచ్చి ఇక భరణం ఇవ్వ క్కరలేదని వాదించాడు. ఆమె హైకోర్టుకెళితే అక్కడ నెలకు 171 రూ. ఇమ్మని తీర్పు చెప్పారు. షరియత్ చట్టం క్రింద చెల్లించనక్కరలేదని భర్త వాదించి సుప్రీం కోర్టు కెళితే అక్కడ కూడా విజయం ఆమెనే వరించింది. హైకోర్టు తీర్పును ఖాయం చేస్తూ నెలకు 171 రూ.లు ఇమ్మని అత్యున్నత ధర్మాసనం తీర్పు చెప్పింది. 125 సి.ఆర్.పి.సి. ముస్లిం మహిళలకు కూడా వర్తిస్తుందని నెలకు 500 రూ లు ఇవ్వ వచ్చని, ఇకముందు అవసరమైతే ఇంకా పెంచమని పార్లమెంటుకు సిఫారసు చేస్తూ జడ్జిమెంటులో వ్రాశారు ఇది సహించలేని మతవాదులు 125 క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ చట్టాన్ని ముస్లిం స్త్రీలకు వర్తించకుండా చేయించారు. అప్పుడు అఖిల భారత మహి ళలు సభలు పెట్టి బ్రహ్మాండమైన ప్రతిస్పందన తెచ్చారు. ఇలా ఎన్నో సందర్భా లలో కుల, మత, భాషా, ప్రాంతీయ దురభిమానాలకు వ్యతిరేకంగా మన స్త్రీలు పోరాడుతూనే వున్నారు. తెలుగుదేశం ప్రభుత్వమును తీసి అన్యాయంగా పడదోసినప్పుడు పెద్ద బహిరంగ సభ, ప్రదర్శన పెట్టి అరెస్టులదాకా వెళ్ళారు. 'సేవ్ డెమొక్రసీ' పేరుతో ఆందోళన జరిపి, కరపత్రాలు పంచిపెట్టింది కూడా ముందుగా మహిళలే. ఎక్కడ అన్యాయం జరిగినా, ఎవరికి నష్టం వాటిల్లినా ముఖ్యంగా స్త్రీలపై జరిగే అత్యాచారాలు ఎదుర్కొంటూనే వున్నారు. ఇది మహిళలు తమ కర్తవ్యంగా భావించి చేస్తున్న ప్రతిస్పందన ఇంతకు పూర్వం లేని చైతన్యం గత దశాబ్దం నుండి వెల్లుబికి పోతుందనేది సత్యదూరం కాదు. 1981 లో హిందూ ముస్లిం తగాదాలో కత్తిపోట్లకు సుమారు 400 మంది హతులయినారని తెలిసి మహిళాభ్యుదయ సంస్థ స్త్రీలు వెళ్ళి సర్వేచేసి 18 పేజీల రిపోర్టు రాసి పంచిపెట్టారు. అన్ని మతాలు, పార్టీల వారిని పిలిచి సమైక్యతా కోసం సెమినారు కూడా నిర్వహించారు.

ఒకప్పుడయితే ఏ ఘోరం జరిగినా కర్మ అనో, పాపఫలమనో, అది ఆడవారి పట్ల అలాగే వుంటుందనో నమ్మేవాళ్ళం. నేటి స్త్రీలలో కలిగిన చైతన్యం వల్ల తిరుగు బాటు మనస్తత్వం పెరిగినదానికి కొన్ని మచ్చుతునకలున్నాయి, 1987 సెప్టెం బరులో రాజస్థాన్‌లో రూప్ కన్వర్ అనే 18 ఏళ్ళ యువతి సహగమనం చేసిందని

తెలిసి యావత్ భారత మహిళాలోకం కంపించిపోయింది. ఆనాడు ఆంధ్రలోని మహిళలు ఆ దురన్యాయంపై టి.వి. ప్రోగ్రాంను నిర్వహించారు. సభలూ, సమావేశాలు జరిపి తమ నిరసనను రాజస్థాన్ ప్రభుత్వానికి, కేంద్రానికి తెలిపారు. 160 ఏళ్ళ నాడు సతీనిషేధ చట్టం పెడితే ఇంకా ఈ దురన్యాయం సమసిపోలేదనే ఆవేదనతో ప్రత్యేక వ్యాసాలు, ఆందోళనలూ నిర్వహించారు. దేశదేశాల మహిళలు ఈ వార్త విని విస్తుపోయారంటే అతిశయోక్తి కాదు

అలాగే 22-11-87 న లోకకళ్యాణం కోసం ఏలూరులో మోనాష్టరీస్‌లో 8 మంది క్రిష్టియన్ సన్యాసినులను పెట్టి వారు జీవితాంతం వెలుగును, ప్రజల్ని చూడకుండా ప్రార్థనలు చేస్తూవుంటే ప్రజలు పాపపంకిలం నుండి విముక్తులవుతారని (ఒక్కొక్కరిని ఆ ప్రాంగణంలోనే ఖననం చెయ్యటానికి 8 గుంటలు కూడా త్రవ్వి వుంచారు) ఇదొక ప్రేయర్‌హవుసులా పనిచేస్తుందని, ఏలూరు బిషప్పు వారిని ఆ గృహంలోకి పంపబోతున్నాడని తెలిసి కొందరు స్త్రీలం వెళ్ళి చూచివచ్చాం. తర్వాత హైకోర్టుకెళ్ళి ఆ చర్యను ఆపించమని రిట్ దాఖల్ చేశాం. అలాగే షకీలా, రమీజాబి, మధుర అనే స్త్రీలను పోలీసు స్టేషన్‌లో రేప్ చేశారని పోలీస్‌స్టేషన్ల ముందు ధర్నా, ప్రదర్శనలు జరిగాయి.

నల్గొండ జిల్లా చింతకుర్తి గ్రామంలో 1991 లో ద్రౌపది వస్త్రాపహరణం లాంటి దుస్సంఘటన మానవత్వాన్నే వమ్ముచేసిన చర్య జరిగింది. ముత్తమ్మ అనే స్త్రీని వివస్త్రను చేసి ఊరంతా దిగంబరంగా తిప్పారని తెలిసి, కొందరు స్త్రీలం వెళ్ళి చూసి, ఆమెకు ఓదార్చి దుండగులపై కేసు నడిపే ఏర్పాట్లుచేసి వచ్చాం. ప్రభుత్వాన్ని దీనికి తగిన చర్య తీసుకోమని వినతిపత్రాన్ని కూడా పంపాము మళ్ళీ ఇలాంటి ఘాత జరగరాదనే ధ్యేయంతో ఈ చర్యను మనదేశంలోనేకాక దేశదేశాల ప్రజల దృష్టికి తెచ్చారు మహిళా కార్యకర్తలు. అమీనా అనే 10 ఏళ్ళ పిల్లను మోసంచేసి గల్ఫ్ దేశానికి తీసుకెడుతున్న షేక్‌పై కేసు నడిపిన విషయం, మనవారంతా ఇది అన్యాయం అని ఇచ్చిన స్టేట్‌మెంట్ల సంగతి మనందరికీ తెలుసు. దీని భావం అది ముస్లిం కేసని, ఇది క్రిష్టియన్ స్త్రీ అని పూర్వంలా కాకుండా ఆంధ్ర మహిళలు ముందుకొచ్చి గందరగోళం చెయ్యటం, ఇది అవినీతి చర్య అని సమాజం దృష్టికి తేవటం జరిగిందంటే అది మన స్త్రీల చైతన్యానికి గొప్ప నిదర్శనం, ఎక్కడ ఏ స్త్రీకి ద్రోహం జరిగినా స్పందించటం, ఆ అవినీతిపరులను బైటకీడ్చి శిక్షింపజెయ్యాలనే తపన పడటం స్త్రీలలో రోజురోజుకూ పెరుగుతోంది. ఈవిధమైన చర్యలవల్ల స్త్రీలలో ఐక్యతాభావం

పెరుగుతోందని భావించవచ్చు. ఇలా ఆందోళనల ద్వారా అన్యాయాన్ని బహిర్గత పరచటం అంటే బానిస బంధాలను త్రెంచుకుని ముందడుగు వెయ్యటమేనని వేరే చెప్పాల్సిన పనిలేదు అలాగే మరో ముఖ్య ఘట్టాన్ని మనం విస్మరించలేము.

"స్త్రీ పురుషులిద్దరికీ లింగబేధం లేకుండా సమానత్వాన్ని రాజ్యాంగం ప్రసాదించడం జరిగిందని అలా చేయడం మానవ శ్రేయస్సుకు, సృష్టిక్రమానికి విరుద్ధమని భగవంతుడు కూడా స్త్రీ పురుషులను సమంగా సృష్టించలేదని" సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి, న్యాయసహా వ్యవస్థకు ప్రధాన పోషకులు, ఇంకా హైకోర్టు న్యాయ మూర్తుల నియామకంలో కూడా ప్రధానపాత్ర వహిస్తున్న చీఫ్ జస్టిస్ రంగనాథమిశ్రా 1990లో బ్రహ్మకుమారీల సభలో హెచ్చరించినప్పుడు ఆ అత్యున్నత న్యాయమూర్తి అనుచిత ప్రసంగం గురించి ఆబాలగోపాలం అంటే 50 శాతం మహిళల్లో జ్వాల ముట్టుకుంది. అంటే స్త్రీలు పతివ్రతలుగా, సహధర్మచారిణులుగా ఉత్తమ గృహిణులుగా, ప్రేమమూర్తులుగా, త్యాగమయిలుగా మనగడ సాగిస్తూ కీర్తి ప్రతిష్టలు పొందాలని జస్టిస్‌గారి ప్రబోధం బయటి ప్రపంచంతో, పురుషులతో పోటీకి రావద్దన దంలోని అంతర్యం ఆమె ప్రతిభావ్యుత్పత్తులు వికసించరాదని, వంట ఇళ్ళల్లో ప్రమగ్గి పొమ్మనేగదా దాని అంతరార్థం. స్త్రీ పరభోగ్యప జీవిగా బ్రతకాలంటూ హితోక్తులు పలికినప్పుడు మహిళా లోకమంతా వాడవాడలా సభలూ, సమావేశాలు పెట్టి మిశ్రా గారిని పదవీ విరమణ చెయ్యమని పిలుపు ఇచ్చినప్పుడు జడ్జిగారు క్షమాపణ చెప్పుకున్న విషయం లోకవిదితమే ఇదంతా మహిళాలోకపు ముందడుగుకాక మరేమిటి? ఇకముందు ఎంత గొప్ప ఆఫీసరయినా, అధికారి అయినా అఖరికి ప్రవక్త అయినా స్త్రీని కించపరిచే సిద్ధాంతాలు, సూక్తులు పలికితే సహించేది లేదని దీని భావం.

ప్రభుత్వపరమైన అభివృద్ధి : 1990లో జరిగిన అభివృద్ధి కార్యక్రమంలో ముఖ్యమైనది బాలికా సంవత్సరం. ఇది సార్క్ దేశాల వారు (దక్షిణ ఆసియా దేశాలు) నిర్ణయించారు ఏటా కోటి 20 లక్షలమంది బాలికలు జన్మిస్తుంటే వారిలో 15 లక్షలమంది చనిపోతున్నారు. బాలికగానే వంట, ఇంటిపని, పిల్లల బాధ్యత, బీడీలు, అగ్గిపుల్లలు తయారు చేయటం, పొయ్యిలోకి పిడకలు చెయ్యటం, ధనవంతుల ఇళ్ళల్లో ఊడిగంలాంటి దుర్భర జీవితాన్ని గడపటం చాలా ఘోరం. ఈ పరిస్థితి మారటానికి తిరిగి వారు 1991 - 2000 వరకు బాలికా దశాబ్దాన్ని నిర్దేశించారు. చట్టాలు, ఆర్డినెన్సులు బాలికా దశాబ్దాలు సమస్యలను పరిష్కరించలేవు. ప్రజాబలం కావాలి. వారిలో స్పందన కలగాలి. కనుక ఈ అన్యాయాన్ని అణచటానికి స్వేచ్ఛా

ప్రియులు, ఉదారులు, స్వచ్ఛంద సేవకులు ప్రభుత్వం శ్రద్ధ వహించాలి. ఇది తెలుగుదేశానికి కూడా సంబంధించినది కనుకనే రాష్ట్రమంతటా ఛైల్డు లేబర్ గురించి సభలు, సెమినార్లు మిక్కుటంగా జరుగుతున్నాయి. నేటి బాలికే రేపటి మహిళ కనుక ఇది ఒకవిధంగా స్త్రీ జనాభ్యుదయానికి సోపానమని పేర్కొనవచ్చు. అంతేకాదు ఇది మహిళా చైతన్యానికి గీటురాయి అనక తప్పదు. ఈ బాలికా దశాబ్దం పూర్వం కన్నా ముందడుగు వేస్తుందనటం అతిశయోక్తి కాదు. మహిళా దశాబ్దం కన్నా, బాలికా దశాబ్దం నాటికి స్త్రీలలో చైతన్యం, జాగృతి పెరగడమే దీనికి కారణం.

మహిళల హక్కులకు, స్వేచ్ఛకు సర్వతోముఖాభివృద్ధికి 1991 లో ఏర్పడిందే 'జాతీయ మహిళా కమీషన్'. రాజ్యాంగపరంగా స్త్రీలకు కల్పించబడిన అనేక హక్కులను, రక్షణలను కూలంకషంగా పరిశీలించి, న్యాయపరంగా, చట్టపరంగా, శాసనపరంగా స్త్రీలకు ఎటువంటి అవకాశాలు, హక్కులు వున్నాయో చర్చించి వారికి తెలియజేసి, అవి సక్రమంగా అమలుపరచడానికి తగు చర్యలు సూచించడం ఈ కమీషన్ విధులలో ముఖ్యమైనది. స్త్రీల సంక్షేమానికి నిర్దేశించిన వనరులు, అభివృద్ధి పథకాలు వారికి చెందకుండా అడ్డుకునేవారిపై తగిన చర్య తీసుకోవడం ఈ కమీషన్ మరో లక్ష్యం. స్త్రీల సమానత్వానికి, వారి లక్ష్యసాధనకు, అభివృద్ధికి ఏర్పరచిన చట్టాలు సక్రమంగా అమలుచేయడంలో ఏర్పడిన జాప్యం, నిర్లక్ష్యం లాంటి లోపాలను తొలగించడానికి అందుకు చేపట్టవలసిన పరిష్కారాలను సూచించడం కూడా ఈ కమీషన్ కర్తవ్యం.

స్త్రీల అజ్ఞానం, అవిద్యల వల్ల వారిపై జరిగే అత్యాచారాలు, వారి అవివేకంతో ఉత్పన్నమయ్యే సమస్యలపై, పరిస్థితులపై ప్రత్యేక పరిశీలనలు, పరిశోధనలు జరిపి వాటి నిర్మూలనకు తగిన ప్రతివ్యూహాలను ఏర్పరచడం, అన్ని రంగాలలో (సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక) స్త్రీల స్థానాలను అభివృద్ధి పరచటం, ఇంకా స్త్రీలకు ప్రాతినిధ్యం కల్పించడానికి ఏవీ సూచనలు చేయాలో అవగతం కావడానికి అవసరమైన విద్యావిషయక పరిశోధనలు చేపట్టడం ఈ కమీషన్ వారికి అత్యవసరమని విశ్లేషించారు. కారాగారాల్లోను, రక్షిత గృహాల్లోను వుండే స్త్రీలను సందర్శించి వారి స్థితిగతులను అభివృద్ధి చేయడానికి తగిన చర్యలు తీసుకోవడం, అలాగే శ్రామిక స్త్రీలు పనిచేసే స్థలాలను సందర్శించి వారి పరిస్థితులను మెరుగుపరచడానికి కృషి చేయడం లాంటి విధులను ఈ కమీషన్ నిర్వహిస్తుందని స్పష్టీకరించడం జరిగింది.

రాజ్యాంగంలోని సెక్షన్ 3 లో వున్న యాక్ట్ ప్రకారం స్త్రీల హక్కుల కోసం ఈ జాతీయ మహిళా కమీషన్ ఏర్పాటుచేయబడింది. ఈ కమీషన్‌లో ఛైర్మన్, ఒక సెక్రటరీ, ఐదుగురు సభ్యులు వుంటారు. అనుభవజ్ఞుల్ని, సమర్థుల్ని, సమైక్యతాభావం కలవారిని ఛైర్మన్‌గా నియమించడం జరుగుతుంది. సభ్యులలో ఒకరు షెడ్యూల్డ్ కులానికి, ఒకరు షెడ్యూల్డ్ జాతికి చెందినవారు వుంటారు. చట్టాలలో, శాసన సంబంధమైన విషయాల్లో, ట్రేడ్ యూనియన్స్‌లో, పరిశ్రమల్లో, స్త్రీలను ఉద్యోగాలలో నియమించడంలో అనుభవజ్ఞులను, స్వచ్ఛంద సంస్థల్లో పనిచేసే ప్రముఖ మహిళా కార్యకర్తలను, పరిపాలనా దక్షత, ఆర్థికాభివృద్ధిలో అనుభవమున్నవారిని, విద్య, ఆరోగ్యం, సంఘ సంక్షేమం కోరే వ్యక్తులను, ప్రముఖ జర్నలిస్టును ఇందులో సభ్యులుగా నియమించాలని నిర్దేశించారు ఇండియన్ పీనల్‌కోడ్ సెక్షన్ ప్రకారం ఇందులో పనిచేసే వారందరూ ప్రభుత్వ సేవకులుగా పరిగణించబడతారు. వీరందరికీ గడువుకాలం 3 సంవత్సరాలు. ఈ కమీషన్ ప్రతి సంవత్సరం వారు చేసిన కార్యక్రమాలపై, పెట్టిన ఖర్చుపై వార్షిక నివేదికను తయారుచేసి కేంద్ర ప్రభుత్వానికి అందజేయాలి. ప్రభుత్వం వాటిని పరిశీలించిన తర్వాత పార్లమెంటు ఉభయసభల ముందుంచడం జరపాలని చెప్పారు. ఎటువంటి పక్షపాతం లేకుండా క్రింద వివరించిన విషయాలలో అధికారాలు, ఆంక్షలు కమీషన్‌లో నియమించబడినవారందరికీ వర్తిస్తాయి.

అవి (ఎ) సెక్షన్ 3 లోని సబ్‌సెక్షన్ (2) క్రింద సమర్థులైన వ్యక్తుల చేత ఒక కమిటీ ఏర్పాటు చేయబడుతుంది. (బి) సెక్షన్ 4 లోని సబ్ సెక్షన్ (4) క్రింద ఛైర్‌పర్సన్ మరియు ఇతర సభ్యులకు జీతాలు, అలవెన్సులు చెల్లించబడతాయి. అలాగే సెక్షన్ 5 లోని సబ్‌సెక్షన్ (2) క్రింద అధికారులకు, ఇతర ఉద్యోగస్థులకు జీతాలు, బత్యాలు చెల్లించబడతాయి. (సి) సెక్షన్ 8 లోని సబ్ సెక్షన్ (3) క్రింద ఈ కమిటీకి హాజరయ్యే వ్యక్తులకు బత్యాలు ఇవ్వబడతాయి. (డి) సెక్షన్ 12 లోని సబ్ సెక్షన్ (1) క్రింద వార్షిక ఖాతాలు, లెక్కలు తయారుచేయబడతాయి. (ఇ) సెక్షన్ 13 క్రింద వార్షిక నివేదిక తయారుచేయాలి. ఇంకా ఇతర విషయాలు ఏవైనావుంటే కూడా సూచించవచ్చునని బిల్లు ప్రతిపాదించింది.

పార్లమెంటు ఉభయ సభల ముందు తయారుచేసి ఆ తర్వాతనే ఈ యాక్ట్‌కు సంబంధించిన ప్రతి రూల్ చేయబడుతుంది. పార్లమెంటు సమావేశాలు జరిగినప్పుడు వీటికి సంబంధించిన విషయాలు చర్చించి అప్పుడు ఉభయ సభలూ అంగీకరించిన

మీదట వాటి రూల్స్ నిర్ణయించడం జరుగుతుంది. ఇలా చేయడంలో ఎటువంటి పక్షపాతానికి అవకాశం బిల్లు స్పష్టీకరించింది. జాతీయ కమీషన్ సమాజాన్నే మార్చగలదు అనే అభిప్రాయం ఉభయ సభల ద్వారా వెల్లడయింది. ముఖ్యంగా స్త్రీల రక్షణ, హక్కులు, స్వేచ్ఛ, సమానత్వాలు ఈ కమీషన్ ద్వారా అమల్లోకి రాపచ్చనే విశ్వాసం ప్రబలంగా వుంది. ఈ కమీషన్‌కు 'షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ జాతుల కమీషన్'కు వున్నన్ని అధికారాలు వుంటాయి. దీనివలన మహిళల్లో ఆత్మవిశ్వాసం పెరిగి వారికున్న హక్కులను, విశేషాధికారాలను ఇంతకు ముందుకన్నా ఎక్కువగా సాధించుకోగలుగుతారని లోక్‌సభలో ఈ జాతీయ మహిళా కమీషన్ గురించి జరిగిన చర్చల్లో వెల్లడయింది. మనదేశంలో 75 శాతం స్త్రీలు నిరక్షరాస్యులుగా వున్నారు. ప్రాథమిక విద్యతో ఆపివేసినవారు 55 శాతం వున్నారు. అవ్యవస్థీకృత వ్యవసాయ కూలీలు, ఇతర శ్రామికవర్గం వారిలో 90 శాతం నేటికీ నిరక్షరాస్యులుగా వున్నారు. స్త్రీలు నేటికీ అజ్ఞానం, అవిద్యల వల్ల అణగద్రొక్కబడిన వారిగా వుండటాన వాళ్ళ స్థితి మెరుగుపరుచుకోవడానికి కావలసిన ధైర్యం, పట్టుదల వారిలో కొరవడినాయి. స్త్రీలలో మార్పు రావడానికి ఈ బిల్లు పునాది అవుతుందని, స్త్రీ జనాభ్యుదయానికి గీటురాయి అవుతుందని ఆశించవచ్చు. జాతీయంగా జరిగే ఈ ప్రయత్నంలో ప్రజలందరి సహకారం అత్యవసరం అనక తప్పదు. ప్రభుత్వం తలపెట్టిన ఏ సంక్షేమ కార్యక్రమమయినా అది మంచిదయినప్పుడు, ఆ పని నిర్విఘ్నంగా కొనసాగాలంటే దానికి ప్రజాబలం, సంకల్పసిద్ధి అత్యవసరం. అలా జరగనినాడు ఏ కమీషన్‌గాని, ఏ చట్టంగాని నిర్వీర్యమయిపోతుంది కనుక స్త్రీలంతా ఐక్యతతో ఈ కమీషన్ తేత వారి బాధ్యతలను, మహిళా చైతన్య కార్యభారాన్ని నడిపించటంలో తమవంతు బాధ్యతను తాము నిర్వర్తించగలగాలి.

1985లో ఆంధ్రలో స్త్రీలకు 30 శాతం ఉద్యోగాలు ఇమ్మని ప్రభుత్వానికి మహిళలు, స్వచ్ఛంద సంస్థలు అర్జీలు పెట్టుకున్నప్పుడు కొన్నాళ్ళకు అది శాంక్షన్ అయ్యింది. ఇది ముందుగా ఆంధ్రలోనే జరిగింది. అలా మూడేళ్ళు రిజర్వేషన్ల ద్వారా స్త్రీలకు 30 శాతం ఉద్యోగాలు ఇవ్వడం జరిగింది. తర్వాత సహించలేని పురుషులు రిట్ వేసి ఆపించారు. ఇప్పుడా విషయం సుప్రీంకోర్టులో నడుస్తున్నది. బహుశః ఇది స్త్రీలపక్షమే కాగలదని ఆశ వుంది. అలాగే వరకట్న మరణాల దర్యాప్తుకు, స్త్రీలపై జరిగే ఇతర చిత్రహింసల విచారణకు పోలీస్ స్టేషనులో ఒక సెల్‌ను పెట్టించమని ముఖ్యమంత్రికి విన్నపాలు మా సంస్థలద్వారా పంపగా "ఉమెన్ ప్రొటెక్షన్ సెల్"ను ప్రవేశపెట్టడం గమనార్హం. అలాగే మహిళా కోర్టులు,

లీగల్ ఎయిడ్ సెంటర్లు అన్నీ ఆంధ్రలోని స్త్రీల ప్రోద్బలంవల్ల స్థాపింపబడినవేనని (గుర్తించి) చెప్పక తప్పదు. పేరు ప్రఖ్యాతులున్న మహిళాభ్యుదయసంస్థను గుర్తించి వరకట్న హింసల దర్యాప్తుకు అధికారమిచ్చింది కేంద్రం. ఇందువల్ల అధిక శక్తివంతగా మేము కట్నాలను తిరిగి ఇప్పించటానికి హింసిస్తున్న వారిపై కంప్లైయింట్లు చెయ్యటానికి కొంత అధికారం మా సంస్థకు సంక్రమించిందని చెప్పటానికి గర్వపడుతున్నాం.

స్త్రీ శిశుసంక్షేమ శాఖకు ప్రభుత్వం గ్రాంట్లు పెంచి కొన్ని సంక్షేమ కార్యక్రమాలు నిర్వహిస్తోంది. వీరు బాల, మహిళా ప్రాంగణాలను జిల్లాకొకటి చొప్పున స్థాపించి అనాధ స్త్రీలకు, భర్తృ తిరస్కృతులకు, భర్తృవిహీనులకు కొన్ని విధాలైన ట్రయినింగులు ఇచ్చి వారికి ఆర్థికంగా ప్రోత్సాహాన్ని ఇస్తోంది. ఉమెన్ ఫైనాన్సు కార్పొరేషన్ ద్వారా అప్పులిచ్చి ఆదుకుంటామంటోంది ప్రభుత్వం. అలాగే సోషల్ వెల్ఫేరవారు స్త్రీలకు వృత్తివిద్యలు నేర్పించడంలోను కండెన్సుడు కోర్సులు నిర్వహించడం, ఎవేర్నెస్ (స్త్రీలలో చైతన్యం) ప్రోగ్రామ్సు లాంటివి నిర్వహించి ముఖ్యంగా మహిళల్లో జాగృతి, చైతన్యం, ఆర్థిక తోడ్పాటు ఇస్తోంది. టి.వి. రేడియోలలో స్త్రీల కార్యక్రమాలు, ప్రత్యేక సదస్సులు, చర్చలు, సాహితీగోష్టులలో, నాటకాలలో స్త్రీలు సమర్థవంతంగా నటిస్తున్నారు. దినపత్రికలు, వార, పక్ష, మాస పత్రికల్లో స్త్రీల శీర్షికలతో స్త్రీల రచనలు రోజురోజుకూ పెరిగిపోతున్నాయి. పత్రికా కార్యాలయాల్లో స్త్రీలు సమర్థవంతంగా పనిచేస్తున్నారు.

**ఆంధ్ర మహిళా సమాఖ్య:** స్వచ్ఛంద సంస్థలలో గణణీయమైనది ఆంధ్ర మహిళా సమాఖ్య. ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్సువారి మితవాద వైఖరి నచ్చని కమ్యూనిస్టు మహిళలు 1954లో భారత స్త్రీల జాతీయ ఫెడరేషన్ను నెలకొల్పారు. 1945లో స్థాపించబడిన అంతర్జాతీయ ఫెడరేషన్కు భారత జాతీయ ఫెడరేషన్ అనుబంధసంస్థ అయింది. "ఆంధ్ర మహిళా సమాఖ్య" భారత జాతీయ ఫెడరేషన్ అనుబంధ సంస్థ 1958 నుండి 1964 వరకు కమ్యూనిస్టు మహిళల కార్యక్రమాలలో స్తబ్దత వచ్చింది. 1965లో కమ్యూనిస్టు మహిళలు 300 మందితో సమావేశమయ్యారు. నూతన సంఘనిర్మాణానికి నిబంధనావళి తయారుచేసేనిమిత్తం కమిటీవేశారు. 1970లో కొత్తగూడెంలో పదివేలమంది సభ్యులు, వెయ్యిమంది ప్రతినిధులతో కలిసి బంజరు భూములు, భూసంస్కరణలు, ఇళ్ళస్థలాలు, వీటికోసం జరిగిన ఉద్యమంలో కృషి చేసిందిసమాఖ్య. అప్పట్లో భారత సోవియట్సంఘకి అనుకూలంగా ప్రచారంచేయడం

కుట్టు కేంద్రాలు నెలకొల్పడం, స్థానిక సమస్యలను పరిష్కరించడం, అధిక ధరలకు వ్యతిరేకంగా వేల సంఖ్యలో దస్కతులు సేకరించడం, రేషన్‌షాపులు ఇతోధికంగా తెరవాలని రిలే నిరాహారదీక్షలు, ధర్నాలు, పికెటింగ్‌లు జరపడం మొదలైన కార్యక్రమాలను చేపట్టి సమర్థవంతంగా నిర్వహించింది ఆంధ్ర మహిళా సమాఖ్య.

రాష్ట్ర మహిళా సమాఖ్య స్త్రీల సంబంధమైన మానభంగాలు, వరకట్న సంబంధమైన మరణాలు, బాల్య వివాహాలులాంటి ఏ సంఘటన జరిగినా ప్రతిస్పందించి ప్రతిఘటన చేస్తూనే వుంది. గ్రామాల్లో మరుగుదొడ్లు, మంచినీరు, వేతనాలు, అధిక ధరలలాంటి విషయాలపై ప్రదర్శనలు, హర్తాళ్ళలాంటి పోరాటాలు ఈనాటి వరకు తెరిపిలేకుండా అధిక సంఖ్యలో వారు జరుపుతూనే వున్నారు.

**ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం :** మార్క్సిస్టుపార్టీ మహిళా సంఘాన్ని ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం అని పేర్కొంటున్నాం. ఇది 1968 లో పుట్టింది. సమాఖ్య, మహిళా సంఘం రెండూ పనిచేసే తీరు ఒక్కటే. కాకపోతే ఎవరి పార్టీని వారు బలపరుస్తారు. కార్మికులు, వ్యవసాయ కూలీలు, బీద రైతులు ఈ వర్గాలకు చెందిన స్త్రీల నుండి అధికంగా సభ్యులు వుంటారు. 1968 లో రాష్ట్ర సంఘానికి ఒక ఆర్గనైజింగ్ కమిటీ వేశారు. దానికి మానికొండ సూర్యావతి అధ్యక్షురాలు, మోటూరు ఉదయం కార్యదర్శిగా వుండేవారు. 1972లో ఏర్పాటైన కమిటీకి మల్లు స్వరాజ్యం సహాయ కార్యదర్శి అయింది. ప్రథమ ఆం. ప్ర. మహిళా మహాసభ 1974 లో ఖమ్మంలో సమావేశమైంది. 5 వందలమంది ప్రతినిధులు వచ్చారు. బహిరంగసభలో 15 వేలమంది, ఊరేగింపులో 6 వేలమంది స్త్రీలు పాల్గొన్నారు. 1970 వరకు కార్యక్రమాలు మధ్యతరగతిలోనే జరిగాయి. అప్పటినుండి శ్రామిక స్త్రీలను కలుపుకొని రావడానికి వారి సమస్యలకు ఇతోధిక ప్రాముఖ్యత ఇవ్వడానికి సంఘం నిశ్చయించింది. ఈ సంఘం తరపున పుస్తకాల ప్రచురణ, కరపత్రాల ప్రచురణ చేసేవారు. అందులో 'మహిళోద్యమంలో చేరండి', విప్లవ మార్గంలో స్త్రీలు, భారతదేశంలో స్త్రీల హోదా ముఖ్యమైనవి కొన్ని వున్నాయి.

ఔరంగాబాద్‌లో ఇళాభట్ అనే ఎం.పి. కొన్ని వేలమంది స్త్రీలకు ఆర్థికపరమైన కార్యక్రమాలు నిర్వహించి వారిని బ్రతుకుబాటలో పయనింపజేస్తోంది. అనేకమంది స్వచ్ఛందంగా తమ తమ మహిళా సంస్థల ద్వారా స్త్రీలకు చేతివృత్తులు నేర్పిస్తున్నారు. బ్యాంకుల ద్వారా అప్పులు ఇప్పిస్తున్నారు. అభ్యుదయ వివాహ వేదికలు

స్థాపించి పూలదండల పెళ్ళిళ్ళు చేయిస్తున్నారు. ట్రయినింగు క్లాసులు నిర్వహించి తద్వారా స్త్రీల హక్కులు, బాధ్యతలు తెలియజేస్తున్నారు ప్రైవు ఇనిస్టిట్యూషన్స్, సూయిసైడ్ సెంటర్స్ స్థాపించి ఆర్థికంగా వారికి తోడ్పాటునిస్తున్నారు. రాష్ట్రంలో 11 కుటుంబ సలహా కేంద్రాలు స్థాపించి బాధితులైన స్త్రీలకు సలహాలు చెప్తున్నారు. దారితెన్ను కానని వారికి షార్టు స్టే హోముల్లో చేర్పించి మూడేళ్ళు పోషిస్తున్నారు. కుటుంబ సలహా కేంద్రాలు, సభలు, సెమినార్లు లాంటివి నిర్వహించి స్త్రీలను చైతన్యవంతులను చేస్తున్నారు. మహిళా దక్షతా సమితి అఖిల భారతంలో బహుకాలంగా అనేక కార్యక్రమాలు నిర్వహిస్తోంది. అలాగే మహిళా దక్షతాసమితి గత రెండేళ్ళుగా ఆంధ్రలో స్త్రీలకు వైవిధ్యంతో కూడిన సేవాకార్యక్రమాలు నిర్వహిస్తోంది. రాష్ట్రంలో 'అన్వేషి' అనే పరిశోధనా సంస్థను స్థాపించి స్త్రీలకు విద్యావిషయకమైన విజ్ఞానాన్ని పంచిపెడుతోంది. గతంలో వీరు స్త్రీశక్తి సంఘటన పేరుతో స్త్రీలపై జరిగే అత్యాచారాలపై ప్రదర్శనలు జరిపారు. అలాగే స్త్రీమేళా, ఐక్య మహిళా సంఘం, వికాసిని ఒకటేమిటి లెక్కకు మిక్కుటంగా మహిళలు, ఇంకెన్నో సంస్థలు, ఇలా ఎందరో మహిళా విదుషీమణులు, సేవాదురంధరులు వున్నారని తెలుసుకొని స్థలాభావం వల్ల చెప్పలేకపోవటం జరిగింది. కొన్ని సంఘాలూ ఆందోళనల్లో పాల్గొంటున్నారు. సంస్థాగత కార్యక్రమాల్లో పాల్గొంటున్నారు, సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. ఇదంతా దశలవారీ గత 40 ఏళ్ళలో జరిగిన పరిణామం. ఇది చాలా శ్లాఘనీయమేకాని ఇంకా చెయ్యాల్సింది 80 శాతం పైగా వుంది. జరిగిన అభివృద్ధి 20 శాతమేనని గ్రహిస్తేనే ముందడుగు వెయ్యగలం. కనుక సమస్యలకు పరిష్కారం కావాలంటే ముందుగా మన కర్తవ్యాలను స్థిరీకరించుకోవాలి. తద్వారా వాటిని ఆచరించాలి. అమలుపర్చాలి.

స్త్రీ జాతి వెనుకబడి వుందని సమానత్వాన్ని సాధించడం అత్యావసరమనే భావం ప్రపంచవ్యాప్తంగా వచ్చింది. దీనికి మార్గాలేమిటి? స్త్రీ విమోచన ఎలా సాధించాలని అన్నప్పుడు వారి వారి ప్రవృత్తిని బట్టి కొన్ని సిద్ధాంతాలు వెలువడ్డాయి. అవి అన్నీ స్త్రీ స్వేచ్ఛను, సమానత్వాన్ని ప్రతిపాదించేవే అయినా రూపాంతరాలతో కొన్ని తేడాలు వున్నాయి. అవి సామాజిక జీవశాస్త్ర సిద్ధాంతం, సామాజిక భావ నిర్మాణవాదం, శారీరక మౌలికవాద సిద్ధాంతాలన్నీ వైవిధ్యంతో కూడిన రూపాంతరాలు వున్నాయి. ఇంకా—

"లిబరల్ ఫెమినిజం" అనేది పెట్టుబడిదారీ సమాజ పరిధిలోనే స్త్రీకి స్వేచ్ఛ ఉంటుందని వాదిస్తుంది. "మార్కిస్టు ఫెమినిజం" సోషలిజం ప్రాతిపదికగా గల

సమాజం మీద విశ్వాసం కలిగి వుంటుంది. ఇది స్త్రీ విమోచన పోరాటం సామాన్య పోరాటం క్రింద లొంగివుండాలంటుంది. కాని "సోషలిస్టు ఫెమినిజం" అలా అను కోవడంలేదు. సనాతన కమ్యూనిస్టుల యొక్క తత్వం మొదటిది అయితే సృజనాత్మక మార్క్సిస్టుల యొక్క తత్వం రెండవ పద్ధతిని ఆమోదిస్తుంది. "రాడికల్ ఫెమినిజం" స్త్రీ తత్వమే గొప్పది అంటుంది. అంటే పిల్లల్ని కనడాన్ని స్త్రీ యొక్క ప్రత్యేకతగా భావిస్తుంది. స్త్రీత్వాన్ని స్త్రీ ఉనికిని ఉజ్వలంగా చిత్రిస్తుంది. ఇది పురుషుని కించ పరుస్తుంది కూడా. స్త్రీ పురుషుల మధ్య సహకారం వుంటుందనేది విస్మరిస్తుంది. "సాంస్కృతిక ఫెమినిజం" స్త్రీత్వాన్ని కాక స్త్రీ యొక్క గుణగణాలను, లక్షణాలను కీర్తిస్తుంది. స్త్రీలో శాంతి, దయ, కరుణ, సహకారం, ఓర్పు, క్షమలాంటి గుణాలు వున్నాయని అందువల్ల స్త్రీత్వమే గొప్పదని పొగుడుతుంది; పురుషుణ్ణి తక్కువగా చూస్తుంది. "హ్యూమనిస్టు ఫెమినిజం" దీనిని మానవవాద స్త్రీ విమోచన సిద్ధాంతం అని పిలువవచ్చు. న్యాయమైన, సమానత్వ భావనతో కూడిన సహకార సమాజం ఈ సిద్ధాంతానికి ప్రాతిపదిక. అలాంటి సమాజాన్ని కొంతవరకైనా సాధించే క్రమంలో సామాన్య మానవ పోరాటాలతోపాటు అదేకాలంలో స్త్రీల పోరాటాలను కూడా నడప వలసి వుంటుంది.

ఈనాటి మన చైతన్యానికి, జాగృతికి దోహదంచేసిన సంస్కర్తలకు ఒకసారి ధన్యవాదాలు చెప్పుకొందాం. సంస్కరణకు చెందిన కందుకూరి దంపతులను, జాగృతి శకానికి చెందిన దుర్గాబాయమ్మ, కనుపర్తి వరలక్ష్మమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, కడప రామసుబ్బమ్మ, ఆందోళన దశకు చెందిన కె. అచ్చమాంబ, లక్ష్మి రఘురాం, ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య అభివృద్ధికి తోడ్పడిన రీటాసేట్. గజ్జల సరళాదేవి, బ్రిజ్‌రాణిగౌర్, రాజ్యంసిన్హా, ఆంధ్ర మహిళా సంఘపు మాసికొండ సూర్యావతి, మోటూరు ఉదయం, మల్లు స్వరాజ్యం, కె లలిత, వసంత, రంగనాయకమ్మ లాంటి వారంతా ఆంధ్రలో పేరెన్నికగన్న మార్గదర్శకులని చెప్పక తప్పదు. ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సు, ఆంధ్ర మహిళాసభ, ఆంధ్ర యువతీమండలి, మహిళాభ్యుదయ సంస్థలు ఆంధ్రలో పేరెన్నికగన్న సంస్థలు, ఇంకా మరెందరో సంస్కర్తలు, సేవా ధురీణులున్నా స్థలాభావంవల్ల పేర్కొనలేదని మనవి చేస్తున్నాను. ఏదయినా ఆంధ్ర స్త్రీలు జాతీయోద్యమంలో జైళ్ళకెళ్ళారు. జైళ్ళలో పురుళ్ళు పోసుకున్నారు. సత్యా గ్రహాల్లో పాల్గొన్నారు. రహస్య కార్యకలాపాల్లో ధైర్యంగా నిలబడి ఉద్యమానికి కొండంత బలాన్ని చేకూర్చారు. ఇలా ఆనాడు స్త్రీలు పాల్గొనని రంగం లేదు. ఆర్థి

కంగా త్యాగాలు చేశారు, అష్టకష్టాలు అనుభవించారు. పురుషులకు తీసిపోనివిధంగా ఎంతచేసినా స్త్రీలకు తగిన స్థాయి, అధికారం దక్కలేదు. అయినా గౌరవమన్ననలను అనుభవించారు.

ఈ అభివృద్ధి అంతా కాదనలేని నగ్నసత్యం. అయితే ఇదంతా స్త్రీల సర్వతోముఖాభివృద్ధా? నాగరికతా ప్రభావమా? విజ్ఞానశాస్త్ర పరిశోధనా ఫలితమా అని ఆలోచిస్తే ఒకవంక మహిళాభ్యుదయం, మరోవంక వెనుకబాటుతనం, నిరాశ, తిరోగమనం రెండూ గోచరిస్తున్నాయి. లేకపోతే ఇన్ని వరకట్న మరణాలు, మానభంగాలు, అత్యాచారాలు ఆడవారిపై రోజురోజుకూ ఎందుకు పెరుగుతాయి. గొడ్రాలయితే వదలివేయటం, కోపంవస్తే మరో స్త్రీని పెళ్ళాడటం. ఇంకా డబ్బుతెమ్మని హింసించటం, భార్య బ్రతికివుండగానే మరో స్త్రీని పెళ్ళాడటం ఇవన్ని మనం పేపర్లలో చూస్తూనే వున్నాం. ఆమెను చంపడమో లేక చచ్చేలా చేయటమో జరుగుతోంది. ఇదంతా ఆలోచిస్తే మనం నాగరికతగా ముందడుగువేశాం, కాని సాంస్కృతికంగా 16వ శతాబ్దాన్ని అధిగమించలేదని అనిపిస్తోంది. అంటే మన వేషభాషలు, జీవిత విధానం మారింది కాని మన సనాతన ఆచార వ్యవహారాల్లో, మూఢనమ్మకాల ప్రభావం మనల్నింకా వదలిపోలేదని చెప్పక తప్పదు. ఈ పరిస్థితి మారటానికి కొన్ని సిద్ధాంతాలు, ప్రణాళికలు రూపొందించుకోవాలి. వాటి స్వరూప స్వభావాలు ఎలావుండాలో ముందుగా వివరించటం చాలా అవసరం.

భవిష్యత్తులో మహిళా అభ్యుదయం ఎలా వుండాలి ? ఆ ప్రయత్నంలో మన కర్తవ్యాలు ఏమిటి ? అనేదొక ముఖ్య ఆలోచన ఈనాడు మన ముందున్నది. గత 45 ఏళ్ళలో జరిగిన స్త్రీల ప్రగతి కేవలం పదిశాతంకన్నా లేదు. కనుక పొందాల్సిన అభివృద్ధి, పోరాడాల్సిన విధానాలు, లక్ష్యాలు అశేషంగా వున్నాయి. ముందుగా అబ్బాయిని, అమ్మాయిని తేడాతో పెంచటం సహించరాని నేరంగా భావించవచ్చు. ఇక ముందు గర్భస్థ పిండం 'ఆడ' అని తెలిసి గర్భస్రావం చేసుకునేవారిని మనమే బాయికాట్ చెయ్యాలి (సాంఘికంగా వెలి). ఆడశిశువును నిర్లక్ష్యం చేసే విధానం పోవాలి. ఏ పరిస్థితిలోనూ స్త్రీ పురుష వివక్షత అసలే చూపరాదు. వివాహానికి పూర్వమే ఇరువురూ కనీసం ఒక సంవత్సరం అయినా ఒకరినొకరు అర్థంచేసుకుని, ఆదర్శాలు, లక్ష్యాలు తిలకించాకనే పెళ్ళాడాలి. ఎందరు బిడ్డల్ని కనాలో ముందుగా నిర్ణయం చేసుకోవాలి. బిడ్డల్ని కనేది తల్లి అయినా పెంచే బాధ్యతలో ఇద్దరూ భాగస్వాములు కావాలి. ఇంటిపనిలో ఇరువురూ బాధ్యత వహించాలి. ఇంటా బయటా ఆడది ఎంత

చాకిరీ చేస్తున్నా ఆర్థికంగా ఆమెకు అసలు గుర్తింపే లేదు. కనుక ఆర్థిక స్వేచ్ఛ స్త్రీకి విధిగా వుండాలి. ఆస్తులు ఇద్దరిపేరా వుండాలి. స్త్రీకి విద్యా, ఉద్యోగార్హత తప్పక వుండాలి. వారికి రాజకీయపరంగా అసెంబ్లీలలో, మంత్రివర్గంలో సమాన భాగస్వామ్యం కొరకు అవసరమైతే రిజర్వేషన్లు కూడా వుండాలి. అలాగే టెక్నికల్ కోర్సుల్లో సగం సీట్లు స్త్రీలకు కేటాయించాలి. పంచాయితీ నుండి పార్లమెంట్ వరకు పరిపాలనా రంగంలో బాధ్యతా పదవులు స్త్రీలకు కేటాయించాలి. సాంస్కృతికంగా స్త్రీలను కించపరిచే సాహిత్యం, స్త్రీలను నీచంగా చిత్రించే సినిమాలు, నగ్న దృశ్యాలు, సెక్సు పాటలు ఉపసంహరించాలి. నైరోబి సభల్లో పేర్కొన్నట్లు స్త్రీ ఇంటి పనిని గుర్తించాలి లేదా నెలజీతమైనా ఇవ్వాలి. ముఖ్యంగా గత నాలుగున్నర దశాబ్దాలుగా అసలు స్త్రీల అభివృద్ధి జరిగిందా లేదా, ఎంతవరకు జరిగింది, అన్ని రంగాలలో అభివృద్ధి జరగాలంటే ఎలాంటి వ్యూహాలు కావాలి? అవి అమలుపర్చటానికి మన కర్తవ్యం ఏమిటి అనేది సీటురాయిగా తీసుకోవాలి. మనం ఎన్నుకోబడిన కార్యక్రమం అభివృద్ధిని సాధించటానికి ఉద్దేశింపబడినదై వుండాలి. అది స్త్రీ కు స్వేచ్ఛా సమానత్వాలు హక్కులు అధికారాన్ని అందివ్వగలిగేదిగా వుండాలి. దానికి ఒకేఒక మార్గం వుంది. అది స్త్రీల అధికార పోరాటం అనే ఉద్యమాన్ని స్థాపించి తద్వారా స్త్రీలంతా ఐక్యతతో పోరాడి తమ హోదాను సాధించుకోవాలి. అసలు అధికారం అంటే ఏమిటి? అనే ప్రశ్న ఉదయిస్తే చాలామంది పురుషుల మీద అధికారం చెలాయించటం అని హేళన చేస్తున్నారు. అది అసలు కానేకాదు. అది పురుషాధిపత్యాన్ని నిరశిస్తుంది. స్త్రీ స్వేచ్ఛను, సమానత్వాన్ని కాంక్షిస్తుంది. సాంఘిక హక్కులు, రాజకీయ అధికారం, ఆర్థిక స్వేచ్ఛ సాంస్కృతికాభివృద్ధిని ఈ అధికార పోరాటం ద్వారా సంపాదించుకోగలం. అంతేకాదు అది వ్యక్తిత్వాన్ని సంరక్షిస్తుంది. కుటుంబంలో శాంతిని ఆకాంక్షిస్తుంది. భావి పౌరులను తీర్చిదిద్దుతుంది. తద్వారా సమాజంలో, దేశంలో శాంతి, అభ్యుదయం, అభివృద్ధిని రక్షించుకోగలం ఆనాడే వ్యక్తుల సౌభాగ్యం ఇనుమడిస్తుంది. స్త్రీలు తమ స్థాయిని స్థానాన్ని నిలుపుకోగలరు. కనుక స్త్రీలు ఐక్యతతో అధికార పోరాటానికి ఆయత్తం కావడం ముందుగా జరగాల్సిన పని ఈ 45 సంవత్సరాలలో వచ్చిన మార్పు కొన్ని రంగాలలో, కొన్ని ప్రాంతాలలో, కొన్ని 'సెక్టారుల'లో చెప్పుకోదగిందే, కాని అది చాలదు. అలా తృప్తిపడి ఊరుకుంటే పురోగమన ప్రయత్నం ఉండదు. స్తబ్ధత ఆవరిస్తుంది. మందకొండితనం వస్తుంది. అది ప్రమాదకరం. ఆ పరిస్థితి రాకుండా స్త్రీలు ముందడుగు వేయటం అత్యవసరం చివరగా ఒక్కమాట- సమాజంలో మార్పు దానంతటది రాదు. వ్యవస్థ మారాలని చెప్తూ కాలక్షేపం చేస్తే చాలదు.

మార్పుకోసం చిన్నదైనా, పెద్దదైనా కృషి అవసరం. ప్రయత్నం కావాలంటే సంకల్పం అవస్యంగా కావాలి. సామాజిక స్పృహ, చైతన్యం లేనిదే సంకల్పం ఉదయించదు. స్త్రీలలో మార్పుకోసం అభిలాష ఉదయించాలి. తీవ్రమైన ఆకాంక్ష పుట్టాలి. దీనికి భావవిప్లవం అవసరం. మానసిక చైతన్యం మున్ముందుగా స్త్రీలలో కావాలి; రావాలి. ఆ సందర్భంగా స్వరాజ్యం తర్వాత కొంత మంచి మార్పు వచ్చినా అది తగినంతగా లేనందున ఇతోధిక కృషి సాగాలి. స్త్రీలు ఆ కర్తవ్య నిర్వహణకు నడుం కట్టాలి. సమాయుత్తం కావాలి. అలా కానిచో స్వాతంత్ర్యోద్యమ పోరాటంలో స్త్రీలు పడ్డ శ్రమ నిరుపయోగమవుతుంది.

స్త్రీ స్వేచ్ఛ చాలా క్లిష్టమైనది; అతి కష్టమైనది కూడా. కొన్ని దేశాల్లో వందల సంవత్సరాలు రాజులు ప్రజలమీద చట్టానికి అతీతమైన, దైవతుల్యమైన హక్కును చలాయించేవారు. అలాగే పురుషులు సైతం స్త్రీలపై అన్ని రంగాలలో (పిల్లల్ని కనటం తప్ప) ఆధిపత్యం వహిస్తున్నారు. పురుషులు ఆ అధికారాన్ని వదులుకోడానికి ఇష్టపడరు. "అసలు మేమెందుకు వదులుకోవాలండీ! స్త్రీలకు అంత తాహతేవుంటే వాళ్ళను సమానత్వం సంపాదించుకోమనండి" అని సవాల్ చేస్తున్నారు. నిజానికి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, నైతిక విషయాలలో సమానత్వం కోసం పోరాడగల ఆసక్తి వుంటే, అందరం కలసి బలాన్ని కూడగట్టుకుంటే అప్పుడు ఒక పథకం ప్రకారం పోరాడవచ్చు. దానికి జాతీయ స్థాయిలో 'ఆర్మీ ఆఫ్ ఉమెన్'ను ముందుగా సృష్టించుకోవాలి ఆ సంఘంలో స్త్రీలంతా చేరాలి. దాన్ని బలపర్చాలి. సమాజానికి స్త్రీ విముక్తి అవసరమని అనిపించేలా చెయ్యాలి. స్త్రీ స్వేచ్ఛా పోరాటాన్ని పటిష్టమైన పద్ధతిలో నడపగల్గాలి. అవసరమొస్తే తిరుగుబాటుకు కూడా వెనుకాడరాదు. స్త్రీజాతి నశింపుకైనా సిద్ధపడతారు కాని పురుషులు అంత తేలిగ్గా స్త్రీలకు స్వేచ్ఛా సమానత్వాలిస్తారనుకోవటం భ్రమ. కనుక ఇది దీర్ఘకాలిక పోరాటం కావచ్చు. అవసరమైతే ప్రత్యక్ష చర్య అంటే ధర్నాలు, సత్యాగ్రహాల ద్వారానైనా సాధించాలి. స్త్రీ ఉద్యమం అంటే స్త్రీ అహంకారానికి చిహ్నం కాదని గ్రహించాలి. తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకోవటానికి సర్వశక్తులూ ధారపోయాలి. అసలు ప్రజాస్వామికం స్థిరపడాలంటే యాభై శాతం ప్రజల్ని అజ్ఞానంతో వుంచటం సాంఘికద్రోహమని పురుషులు గ్రహించేలా చెయ్యాలి. ఈ పరిణామంలో వచ్చే సమస్యలను ఎదుర్కోగల ధైర్యస్థైర్యాలను స్త్రీలు ముందుగా అలవర్చుకోవాలి. ఆనాడే స్వాతంత్ర్య ఫలితాన్ని స్త్రీలు సంపూర్ణంగా అనుభవించగలరు.

స్త్రీల పరిస్థితిని మార్చటానికి తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకోటానికి, భవిష్య ద్దర్శనానికి కొన్ని లక్ష్యాలను ముందుగా నిర్మించుకొని, తర్వాత వాటిని క్రమంగా అమలుపరచగలగాలి. ముందుగా కావాల్సింది, పెరగాల్సినది స్త్రీ విద్య. అనియత విద్య కూడా చాలా అవసరం. 2 వేల సంవత్సరాల నాటికి శారీరక, మానసిక, సాంఘిక హెల్తును సమాజం మొత్తానికి అందివ్వాలని, ముఖ్యంగా స్త్రీల ఆరోగ్య విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించాలని డబ్ల్యు. హెచ్.ఓ. నిర్దేశించింది. కనుక ఆరోగ్యం చాలా అభివృద్ధికరంగా పుంజుకోవాలి. కుటుంబ నియంత్రణ విషయంలో ఆపరేషన్లు చేయించుకోమని ఈనాటి స్త్రీలపై వత్తిడి హెచ్చుగా వుంది. అది తగ్గించి పురుషులను చేయించుకోమని అడగాలి. రాజకీయ పార్టీలవారు, పురుషులు జనాభా తగ్గింపు విషయంలో శ్రద్ధ వహించటం చాలా అవసరం. టార్గెట్సు అమలు చెయ్యటానికి స్త్రీలపై మాత్రమే ఆజమాయిషి పెరగటం అంత మంచిదికాదు.

చివరగా ఒక్క మాట చెప్పక తప్పదు. ఎవరు సంకెళ్ళలో బంధింపబడ్డారో వారే బంధ విముక్తికై స్థిరచిత్తంతో పాటుపడాలి. 'స్వరాజ్యం నా జన్మహక్కు' అని ఆనాడు తిలక్ మహాశయుడు ప్రకటించి ఆ ఆశయ సిద్ధికై ప్రజలలో అగ్నిజ్వాల రేకెత్తించినట్లు స్త్రీలు కూడా తమ శక్తియుక్తులను వాడి తాము స్వేచ్ఛా సమానత్వాలను అనుభవించి సమాజాన్ని, దేశాన్ని అభ్యుదయ పథాన నడిపించిననాడే భవిష్యద్దర్శనం సుఖశాంతుల కాలవాలమవుతుంది. విస్మరించరాని విషయమేమంటే స్త్రీల భాగస్వామ్యం లేనిది సమాజ పురోగతి అసాధ్యమని మనం తేల్చుకున్నాం. స్త్రీల సహకారం లేని పురుష ప్రపంచం బలహీనమవుతుంది. అందే సమాజ ప్రగతి కుంటుపడుతుంది. సమాజపు నడక సాఫీగా సాగదు. సామాజిక న్యాయం మృగ్యమయిన దేశం అభివృద్ధిని పొందలేదు. ఈ పరిణామ ప్రక్రియలో స్త్రీల పాత్ర ఏమిటి ? మొదటిది స్వయం ఉద్ధరణ. తమ పరిస్థితిని తాము బాగుచేసుకోవటానికి కృషి. రెండవది సమాజం యావత్తును ముందుకు నడిపించుకోవలసిన బాధ్యత. అయితే సమాజం వారిని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు దూరం చేస్తున్నది. ఈ పరిస్థితి మారే కృషిలో స్త్రీలు కూడా పాలుపంచుకోవటం అవశ్య కర్తవ్యం. అయితే అది పురుషాధిపత్యానికి దోహదం చేయరాదు. సాధారణ పోరాటాలలో పురుషులతో కలసి పనిచేస్తూ, స్త్రీల ప్రత్యేక సమస్యల మీద స్త్రీల దృక్పథంతో పోరాటాలు నడుపుతూ ముందుకు సాగిపోవాలి. అన్ని రంగాలలో అధికారాన్ని సంపాదించుకోవడానికి స్త్రీలు సన్నద్ధులు కావాలి. ఇలా దేశ ప్రగతికి, సామాజిక పురోగతికి దోహదం చేయడం ఈనాటి స్త్రీల అవశ్యకర్తవ్యం.

# జాతీయ సమైక్యత

మనదేశంలో అనేక కులాల, మతాల, భాషలవారు నివసిస్తున్నారు. వీరి ఆచార, సంప్రదాయాలు వేరువేరుగా వున్నందువల్ల సమైక్యత లోపిస్తోంది. వీరిలో కుల, మత, భాషా ప్రాంతీయ దురభిమానాలు మెండుగా ఉండడంవల్ల జాతీయ సమైక్యత దుర్లభమనే వాదన ప్రబలంగా వుంది. అయినా పూసలలో దారంవలె భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో భిన్నత్వం వుండబట్టే మనమంతా కలిసి జీవిస్తున్నామని మరో వర్గం వాదిస్తోంది. మత కలహాలు జరిగినప్పుడల్లా, కుల కొట్లాటలు సంభవించినప్పుడల్లా, జాతీయ సమైక్యత భగ్నమవుతోందని నాయకులు గగ్గోలు పెడుతున్నారు. భాషా విభేదాలు. సరిహద్దుల కొట్లాటలు జరిగినప్పుడల్లా సహజీవనం నశిస్తోందని ప్రజలు భయాందోళనల పాలవుతున్నారు. ఈ కలవరపాటుకు అసలు ఆధారం వుందా? లేక కల్పించుకున్న భయాల ఫలితమా? అసలు జాతీయ సమైక్యత అంటే ఏమిటి? అది మనదేశంలో నెలకొని వున్నదా? లేదా? లేకపోతే దేశానికి కలిగే ప్రమాదం ఏమిటి? ఈ ప్రమాదాన్ని ఎలా అరికట్టాలి? దీనికి జనాభాలో సగ భాగమైన స్త్రీల కర్తవ్యం ఏమిటి? అనేవి చర్చనీయాంశాలయినాయి. కనుక పరిశీలిద్దాం.

సమైక్యత సహజీవనంకన్నా గొప్పది. కనుక సమైక్యతను భాషా సమైక్యత వల్ల సాధించగలమా? లేక మత సమైక్యత వల్లనా, చారిత్రక పరిశీలన వల్లనా ప్రేమ వివాహాలవల్లనా, "కామన్ సివిల్ కోడ్"వల్లనా అనేవి అంతర్భాగాలుగా వున్నాయి. కనుక సునిశితంగా పరిశీలిద్దాం.

కేవలం ఒక్క భాషవల్లనో లేక ఒక మతం వల్లనో జాతి ఏర్పడదు. మతం, భాష, కులం, వేషధారణ. ఆచార వ్యవహారాలు, నివశించే ప్రదేశపు వాతావరణం ఇవన్నీ కలిస్తే జాతి ఏర్పడుతుంది. నాగరికత అనండి, సంస్కృతి అని అనండి, మరేదన్నా అనండి, కానీ అన్నీ కలిస్తేనే విలక్షణమయిన జాతిగా భాసిల్లుతుంది. అటువంటి జాతుల మధ్య సమైక్యతనే జాతీయ సమైక్యత అని నమ్మేవారు అనేకమంది ఉన్నారు. ఇది కూడా పూర్తి సత్యం కాకపోవచ్చు ననే వారూ లేకపోలేదు.

ఇటీవల ఈ అంశంపై చర్చలు విపరీతంగా సాగుతున్నాయి. ఎప్పుడు భాష విషయంగా తగాదాలు వచ్చినా, మత కలహాలు సంభవించినా జాతీయ సమైక్యతను గురించి ప్రసంగాలు, సభలు జరగటం మామూలయింది. సదస్సులు నిర్వహించడం తీర్మానాలు ఆమోదించడం పరిపాటి. తాత్కాలికమయిన ప్రమాదం తప్పిపోగానే అందరూ ఆ విషయం మర్చిపోతారు. ఇది మామూలుగా జరుగుతున్న జరిగే తంతు.

ఈ విషయం నిజానికి దేశానికి సంబంధించిన సమస్య కనుక దీనిని గురించి కూలంకషంగా అధ్యయనం చేయటం అవసరం.

"జాతీయ సమైక్యత" అనే పదజాలం రెండు ముఖ్యమయిన పదాలు, ఉన్నాయి. ఒకటి జాతి, రెండవది సమైక్యత. ఈ రెంటిని విడివిడిగా నిర్వచనం చేయటం తప్పనిసరిగా జరగాల్సిన పని.

జాతి అనే తెలుగు మాటను "నేషన్" అనే ఇంగ్లీషు పదానికి పర్యాయ పదంగా వాడుతున్నాము. సామ్రాజ్యాలు యూరపులో బద్దలయి జాతీయరాజ్యాలు ఉద్భవించిన తరుణంలో అంటే 18,19. శతాబ్దాలలో ఈ పదం వాడుకలోకి వచ్చింది. జాతి అనేక అంశాలపై ఆధారపడుతుంది. భౌగోళిక ప్రదేశం, చరిత్ర నాగరికత, సంస్కృతి, భాషా, తెగ, మతం ఆలాంటి అంశాలు అనేకం ప్రాధాన్యత వహిస్తాయి. అయితే గమనించదగిన విషయమేమిటంటే ఇందులో ఏ ఒక్క అంశమూ జాతిని ఏర్పరచదు. అనేక అంశాలు కూడితేనే జాతి ఏర్పడుతుంది. అయితే ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క అంశం ప్రాధాన్యత వహిస్తుంది. ఇజ్రాయిల్ జాతి నిర్మాణంలో మతం ప్రముఖ పాత్ర వహించింది. భారతజాతి ఏర్పడటంలో రెండువందల సంవత్సరాల విదేశీ పరిపాలనక్రింద దేశం మగ్గటం ఉపకరించింది. బ్రిటన్‌లాంటి దేశాలలో భౌగోళ పరిస్థితి ప్రధానాంశం అయింది. ఫ్రెంచి జాతీయత ఉదయించటానికి ఫ్రెంచి భాష దోహదం చేసింది. ఇలా వివిధ అంశాలుజాతి నిర్మాణంలో కీలకవిషయాలు అయినాయి.

ఇకపోతే సమైక్యత విషయం. ఐక్యత వేరు, సమైక్యత వేరు. ఐక్యతకన్నా సమైక్యతలో బంధం ఎక్కువ. భిన్నాంశాలు వున్నా దేశాలు, జాతులు ఐక్యతను

ఎప్పుడయితే మానవ వ్యక్తి సమాజంలో సంచరించడం జరుగుతున్నదో అపుడు సమాజంలో అందరికీ స్వేచ్ఛగా సంచరించే హక్కు వున్నదని గమనించాలి. ఎవరికీ నిర్నిబంధమైన పరమమైన స్వేచ్ఛ ఉండటానికి అవకాశం లేదు. ఒకరి స్వేచ్ఛ తతిమ్మావారి స్వేచ్ఛకు అడ్డు రాకూడదు. అంటే వ్యక్తికి సమాజంలోని తదితరుల యెడ బాధ్యత ఏర్పడుతుంది. అంటే తన స్వేచ్ఛకూ ఇతరుల స్వేచ్ఛకూ సమన్వయం చేసుకోవాల్సి వుంటుంది. స్వేచ్ఛా, బాధ్యత ఒక నాణానికి బొమ్మా బొరుసూ లాంటివి. అవి పరస్పర ఆధారితాలు. స్వేచ్ఛలేని బాధ్యత లేదు, బాధ్యతలేని స్వేచ్ఛ వుండదు.

స్వేచ్ఛను, బాధ్యతను గుర్తించిన తరువాత, వాటి పరస్పర సంబంధాన్ని గమనించిన తదుపరి లైంగికత సందర్భంగా ఈ భావాల ప్రభావం ఎలా వుంటుందనేది విచారణీయాంశం.

ఇప్పుడున్న పురుషాధిక్య సమాజంలో పురుషుని లైంగికతకు స్వేచ్ఛ కావాలని ప్రబోధం చేయాల్సిన అవసరం లేదు. కాగా స్త్రీయొక్క లైంగికత విషయం మాత్రమే ముచ్చటించాల్సి వుంటుంది.

వివాహబంధంలో స్త్రీ లైంగికతకు స్వేచ్ఛ వుండాలా లేక అది ఆమె బాధ్యతవల్ల నియంత్రణం అవుతుందా అనేది రంగం మీదికి వచ్చిన ప్రశ్న. వైవాహిక జీవితం పురుష ప్రాధాన్యంగా సాగుతున్న సమయంలో స్త్రీ లైంగికతను చిదిమివేయటం జరిగింది. సంతానాన్ని కనే సందర్భంగా, పెంచి పోషించే విషయంగా ఆమె బాధ్యత పేర ఆమె లైంగికతపై ఆంక్షలు విధించబడ్డాయి, సంతాన ప్రాప్తికి, దాంపత్య జీవితానికి పూర్వం వుండే సంబంధం విడిపోవడంతో నూతనాంశాలు రంగప్రవేశం చేశాయి. తన సంతానం యొక్క శ్రేయస్సుకు, మానసిక వికాసానికి, అభ్యుదయానికి అడ్డురాని రీతితో ఆమె లైంగికత స్వేచ్ఛగా వికసించవచ్చునా? అలాగే వివాహ సమయాన, దాంపత్య జీవితపు ప్రారంభవేళ స్త్రీ పురుషులు ఇరువురు చేసిన, చేసుకున్న ఒడంబడికలకుభిన్నంగా స్త్రీ సంచరించవచ్చునా? కుటుంబంలోని పురుషుడు తనను నిరాదరణ చేసినప్పుడు, స్త్రీ తన లైంగికతకు అనుభవరూపం ఇవ్వటం సబబా? ఇలాంటి ప్రశ్నలు అనేకం ఉదయిస్తాయి. వీటికి జవాబు ఇవ్వటంలో పురుష ప్రాధాన్య సమాజాన్ని సమర్థించే స్త్రీ పురుషులకు ఏ విధమైన సంకోచమూ, సందేహమూ వుండవు. స్త్రీని పూర్వంలాగానే శృంఖలాబద్ధం

గానే వుంచాలని వారి సంకల్పం, వారి ఆశయం కూడాను. అలాంటి వారిని గురించి స్త్రీ విమోచన వాదులు పట్టించుకోనవసరం లేదు; కాగా స్త్రీ సేచ్ఛావాదుల విషయం లోనే జాగరూకతతో కూడిన చర్చ ఆవశ్యకమవుతుంది.

స్త్రీ మానవి. కనుక ఆమెకు మానవ హక్కులను పురుషులతో సమదీటుగా అనుభవించగల తాహతు వుంది. దాంపత్య జీవితరంగంలో కూడా ఆమె హక్కులను, ఆమె స్వేచ్ఛను ఎవరూ కాదనరాదు; కాదనవీలులేదు. సమాజంలో మానవులు మనుగడ సాగిస్తున్నా మానవులు సామాజిక వ్యక్తులని గ్రహించవలసి యున్నది. ప్రపథమంగా మానవుడు లేక మానవి ఒక వ్యక్తి. అతనికోసం లేక ఆమె కోసమే సమాజం ఉద్దేశింపబడింది. కనుక స్త్రీ వ్యక్తిగా వున్న స్వేచ్ఛను గురించి తర్క వితర్కాలు సాగించటం అత్యవసరం.

ఎప్పుడయితే నిర్నిబంధమైన స్వేచ్ఛ, లేక అపరితమైన స్వేచ్ఛ ఉండజాలదని భావించామో ఏ మేరకు స్వేచ్ఛ వుండాలనేది ఆయా పరిస్థితులపై ఆధారపడుతుంది. దేశ కాల పాత్రలనుబట్టి పరిస్థితులు వేరువేరుగా వుంటాయి. పిడుగుకు బియ్యానికి ఒకే మంత్రం పనికిరాదు. కనుక పరిస్థితుల విశ్లేషణనుబట్టి స్త్రీ పురుషుల స్వేచ్ఛా ప్రవర్తనపై నియంత్రణాంశాలు వుంటాయి. ఉదాహరణకు మూడు నెలల పసికూనను కలిగియున్న స్త్రీ భర్తను కోల్పోతుంది అనుకోండి. అతడు మరణించి వుండవచ్చు, లేక ఆమెను విడనాడి వెళ్ళిపోయి వుండవచ్చును. ఈ పరిస్థితిలో స్త్రీ కేవలం తన లైంగికతకు వికాసం కలుగజేసే పరిస్థితిని గురించి ఆలోచించాలా లేక సంతానపు శ్రేయస్సును గమనించి తను స్వార్థ త్యాగం చేయాలా? ఒక వైఖరి కేవలం స్వేచ్ఛకు సంబంధించినది. మరియొక దృక్పథం కేవలం బాధ్యత వల్ల ఉత్పన్నమయినది. ఇక్కడే సమన్వయ దృష్టి అవసరం. ఆమె బిడ్డను తన బిడ్డగా చూచుకొని ఆదరించగల పురుషుడు తటస్థించేవరకు ఆమె దాంపత్య జీవిత విషయం ఆలోచించటం ధర్మంకాదు. మరియొకకేసు తీసుకుందాం ఆమె నవ జవ్వని. భర్త మరణించాడు. పిల్లలు లేరు. ఆమె భర్తను తలుచుకుంటూ మోడుగా జీవించాలా లేక అనుకూలవంతుడు, ఆమెను ఆదరించి ప్రేమించి, గౌరవించగల పురుషుడు తటస్థించినపుడు ఆమె తన జీవితంలో మరొక వసంతాన్ని వెలయించుకోవాలా? ఇక్కడ కూడా ఒక అంశం అనుసరణీయం అవుతుంది. ఆమె భర్త స్మృతిలో ఆమెకు ఆనందం, బలం, జీవనశక్తి కలుగుతున్నాయా లేక

కొంగ్రొత్త జీవితం కోసం అర్రులు చాస్తున్నదా? ఇది కీలక ప్రశ్న. రెండో సంద ర్భంలో ఆమె మరియొక పురుషుని ద్వారా తన లైంగికతను వికసింప చేసుకుంటే ఆమె ప్రవర్తన దోష భూయిష్టంకాదు. ఇలా స్వేచ్ఛను, బాధ్యతను గుర్తెరిగి స్త్రీ పురుషులు అందులో ముఖ్యంగా స్త్రీలు సంచరించటం అవశ్యకర్తవ్యం.

# నీతి : లైంగిక స్వేచ్ఛ

ఈ విషయాన్ని స్త్రీల పరంగా చర్చించటమే ఈ వ్యాసపు ముఖ్యోద్దేశ్యం.

లైంగిక స్వేచ్ఛ అంటే స్త్రీ తనకు నచ్చిన పురుషునితో లైంగిక సంపర్కం నెలకొల్పుకునే అవకాశం కలిగి ఉండటం అని మనం తేలికగా అర్థం చేసుకోగలం.

నీతి అంటే పలు భేదాభిప్రాయాలు ఉన్నాయి. నీతి శాశ్వతమని కొందరు సాపేక్షమని మార్పు చెందుతుందని మరికొందరు వాదిస్తున్నారు. నీతి దైవ ప్రతిపా దితమని కొందరు అభిప్రాయపడుతుంటే అది దేశ కాల పాత్రలనుబట్టి మానవులు నిర్ణయించుకునేదని ఇంకా కొందరు ప్రకటిస్తున్నారు. నైతిక సూత్రాలను ఉప యోగ వాద సిద్ధాంతాన్నిబట్టి (UTILITARIANISM) నిర్ధారించాలని ఒకవర్గం అంటూ ఉంటే అలా కాదు హేతుబద్ధమైన నీతి(**RATIONAL MORALITY**) అవశ్యకమని మరో వర్గం ప్రచారం చేస్తున్నది. ఇలా భిన్న భిన్న దృక్పథాలు, వైఖరులు, ఆలోచనారీతులు సాంస్కృతిక రంగంలో సహజీవనం చేస్తున్నాయి. దీనితో ఏది నీతి, ఏది అవినీతి, దీనికి గీటురాళ్లు ఏమిటి అనే మీమాంస మనముందు నిల్చింది.

మానవులు సామాజిక జీవులు, కలసి జీవించవలసినవారు; అలా జీవిస్తున్న వారు. ఒక వ్యక్తికి మరియొక వ్యక్తికి లేక తదితర వ్యక్తులకు ఉన్న సంబంధాన్ని నిర్ణయించేదీ నీతి. మనం జీవించే సమాజంలో కొన్ని నియమాలు ఉన్నాయి. సమాజం అడ్డదిడ్డంగా ఉండే వ్యవస్థకాదు. దానిని కొన్ని నియమాలు నియంత్రణం చేస్తున్నాయి. అవి మంచివా. చెడ్డవా లేక యుక్తమా, అయుక్తమా అనేది వేరే విషయం. కనుక సమాజాన్ని నియంత్రణం చేసే నియమాలకు ఆద్యంతాలు వుంటాయి. ఒక పరిస్థితిలో అవి అవసరమవుతాయి. మరో పరిస్థితిలో అవి నిరుప యోగమవుతాయి. నియమాల వెనుక కొన్ని సూత్రాలు ఉండక తప్పదు. ఆ సూత్రాలు కూడా దేశ కాల పాత్రలను బట్టి మారతాయి. అయితే ఆ సూత్రాలను

నిర్దేశించే మానవ నైజం ఉంటుంది. ఆ మానవ నైజం మానవ విలువలను ప్రతిపాదిస్తుంది. ప్రేమ, కరుణ, స్నేహం, విశ్వాసం ఇలాంటివి మానవ స్వభావ సంబంధితాలు. ప్రేమ అనేక రూపాలు ధరిస్తుంది. పెద్దలయెడ గౌరవము, పిన్నలయెడ వాత్సల్యం, భార్యయెడ, ప్రియురాలి పట్ల అనురాగం, ఇవన్నీ ప్రేమ రూపాంతరాలు. ఇవి మారేవి కావు. వీటిని శాశ్వత విలువలంటాము. వీటి రూపాలు మారవచ్చు కాని వీటి స్వభావం మారదు. అంటే నైతిక విలువలు మారవు. నైతిక సూత్రాలు మాత్రం కాలధర్మాన్ని బట్టి మార్పుకు లోనవుతాయి. ఈ పచ్చి నిజాన్ని గమనించక కొందరు నీతి మారుతుందంటారు. అది పొరపాటు. నీతిని, నైతిక సూత్రాలను కలగల్పుచేసి మాట్లాడటం అవివేకం.

పై చర్చ వలన కొంతగా కొంత నీతియొక్క స్వరూప స్వభావాల వివరణ మనకు లభించింది. ఇప్పుడు సూటిగా ప్రస్తుతాంశ చర్చలోకి వద్దాం.

స్త్రీ లైంగిక స్వేచ్ఛ ఎప్పుడు నీతివంతమవుతుంది? ఎప్పుడు అవినీతి కరమవుతుంది?

వేల సంవత్సరాలనుండి పురుషాధిక్య సమాజం విలయతాండవం చేస్తున్నది. స్త్రీ యొక్క తను ధన మనః ప్రాణాలమీద పురుషుడు ఏ రూపంలో కూడా తండ్రిగా, భర్తగా, తనయుడిగా, సోదరుడుగా- అధికారం చలాయించడం మానలేదు. ఆమెకు తనదంటూ ఏమీ లేకుండా పోయింది. ఇప్పుడు ఆమెకు కొంతగా కొంత రాజకీయ స్వాతంత్ర్యం లభిస్తున్నది. ఆర్థిక స్వాతంత్ర్యం కోసం ఆమె అర్రులు చాస్తున్నది. సామాజిక స్వేచ్ఛ ఆమెకు కరువయింది. కుటుంబంలో ఆమె గొడ్డు చాకిరీ చేస్తున్నది. 'లైంగిక స్వేచ్ఛ' అనేది ఆమె కలలో కూడా ఊహించలేని అంశం. ఆమె జీవిత ధ్యేయం వివాహం. ఆమె జీవిత పరమార్థం భర్తకు సంతానాన్ని ప్రసాదించడం. ఆమె ధర్మం భర్తకు శారీరక సుఖాన్ని, అతడు కోరినపుడు అందించటం. పాతివ్రత్యం ఆమెకు ఆభరణం? వైధవ్యాన్ని పాటించటం ఆమె విధ్యుక్తధర్మం. ఇవి ఆమెకు చిన్ననాటి నుండి ప్రబోధించబడిన నీతి సూత్రాలు. దీంతో ఆమె వ్యక్తిత్వం మటుమాయమయింది. ఆమె అస్తిత్వానికి విలువ లేకుండా పోయింది. ఆమె మానవ వ్యక్తిగా మిగలలేదు, వ్యక్తి కాని మనిషికి స్వేచ్ఛకోరే హక్కు ఎక్కడిది?

వైవాహిక జీవితంలో కూడ ఆమెకు లైంగిక స్వేచ్ఛ లేదు. ఆమె తన

లైంగికతను ప్రదర్శిస్తే ఆమెకు 'స్వైరిణి' అనే బిరుదును ప్రసాదిస్తుంది పురుషాధిపత్యానికి లోనయిన సమాజం. తన లైంగిక వాంఛను భర్తకు సహితం తెలియ పర్చటానికి ఆమె సంకోచిస్తుంది. లజ్జ స్త్రీకి ఆభరణమట. బిడియం ఆమెకు పెట్టని సొమ్మట. ఇవి రెండూ ఆమెకు అడ్డుగానిలుస్తాయి, ఇంకెక్కడి స్వేచ్ఛ !

బలవంతపు కన్యాత్వం, బలవంతపు వైధవ్యం ఆమెకు సమాజం పెట్టే శాపాలు. తండ్రి తగిన వరకట్నం ఇచ్చి తనకు పెళ్ళి చేయలేకపోతే ఆమె వృద్ధ కన్యగా మిగిలిపోవలసిందే. పసికూనకు పెళ్ళి చేసినా భర్త మరణిస్తే ఆమెకు బల వంతపు వైధవ్యం తప్పదు. (1856లో విధవా పునర్వివాహ శాసనం వచ్చినా ఇప్ప టికీ వితంతువులను వివాహమాడటానికి యువకులు ముందుకు రావటంలేదు.) మరి ఆమె లైంగిక స్వేచ్ఛ ఏమయినట్లు?

వైవాహిక జీవితంలోకి అడుగుపెట్టిన ముద్దరాలిని భర్త నిరాదరణ చేస్తే పరవనితాసక్తుడయి ఆమెను ఇక్కట్లు పాలుచేస్తే, ఆమెను కేవలం సంతానం కనే యంత్రంగా లేక తన కామ తృప్తి సాధనంగా వాడితే ఆమెను మానవిగా అభిమా నించి గౌరవించకపోతే, ఆమెను వ్యక్తిగా గుర్తించకపోతే ఇల్లాలి పరిస్థితి ఏమిటి? ఆమెకు కేవలం బాధ్యతలే మిగులుతాయా? ఆమె లైంగిక స్వేచ్ఛ ఏమి కావాలి? ఆమెకు సానుభూతి చూపిన పరపురుషునికి ఆమె సన్నిహితురాలయితే ఆ క్రమంలో ఆమెకు అతనితో లైంగిక సంబంధం ఏర్పడితే అది ఆమె దోషమా? అది ఆమె అవినీతియా ? ఈ ప్రశ్నకు సూటిగా సక్రమంగా సమాధానం చెప్పగల ధైర్యం స్త్రీ పురుషులకు ఉన్న నాడు సమాజం బాగుపడుతుంది.

భర్త నపుంసకుడయితే, అశక్తుడయితే, వికలాంగుడయితే అతనిని విడనాడ కుండా అతనిని సానుభూతితో పోషిస్తు మరియొక పురుషునితో లైంగిక సన్నిహి తత్వాన్ని నెలకొల్పుకున్న స్త్రీ దుష్టురాలా ?

సమాజంలోని దుష్ట పురుషుల వల్లకాని, కుటుంబంలోని మేకవన్నె పులుల యిన దగ్గర బంధువులైన పురుషులవల్ల కాని కన్యాత్వాన్ని లేక సతీత్వాన్ని కోల్పో యిన యువతులను తల్లిదండ్రులు, భర్తలు పరిత్యజిస్తే ఆ స్త్రీ గతి ఏమిటి ? వారు చేసిన "పాపం" ఏమిటి ? వారి తప్పిదం ఏమిటి ? అలాంటి వారిని 'చెడిపోయిన వారని', 'పతితులని' 'భ్రష్టులని' నామకరణం చేసి వారిని సంఘ బహిష్కృతులను చేస్తె వారు ఏదో ఒక పురుషుని పంచన చేరి జీవనయాత్ర సాగిస్తూ ఆ పురుషునితో

లైంగిక సంపర్కం నెరపుతుంటే ఆమె అవినీతి పరురాలవుతుందా ? అలాకాక ఆమెను సమాజం కాలి క్రింద పడిన పువ్వును నలిపి వేసినట్లు నలిపివేస్తే కేవలం బ్రతుకు తెరువు నిమిత్తం ఆమె పడుపు వృత్తిని ఆశ్రయిస్తే ఆమె "కులట" అవుతుందా ?

ఇలా ఎన్నో సందర్భాలను. సన్నివేశాలను ఉటంకించ వచ్చును. ఇవన్నీ మనకు ఏమి తెలియజేస్తున్నాయి ? స్త్రీల లైంగిక స్వేచ్ఛను సమాజం అసలు గుర్తించదు. అథవా కొన్ని పరిస్థితులలో అంటే పురుషునికి ఆనందాన్నందించే నిమిత్తం గుర్తించినా దానిని ఆమెఇష్టపూర్వకంగా తనకొరకు అనుభవించటానికి అవకాశం ఇవ్వదు. ఇదీ సమాజపు ధోరణి. పురుషాధిపత్య సమాజం సాగినంత కాలం స్త్రీలకు ఏ స్వేచ్ఛా లభించదు; లైంగిక స్వేచ్ఛ అసలే అందుబాటులో ఉండదు. ఈ పచ్చి నిజాన్ని స్త్రీలు ఎంత త్వరగా గుర్తిస్తే అంత మంచిది.

# స్త్రీలు : వివాహము, లైంగిక స్వేచ్ఛ

వివాహం, దాని పుట్టుక, చారిత్రక పరిణామం గమనిస్తే వివాహం కేవలం సామాజికాంశంగానూ, సంతాన సంరక్షణకోసమూ ఏర్పడినట్లు తోస్తుంది. స్త్రీ పురుషుల మధ్య అనురాగం, భావసాదృశము, కనీసం ఒకరి భావాలపై మరియొకరి ఆత్మీయత ఆదర గౌరవాభిమానాలు, తద్వారా వాంఛించే సన్నిహితత్వం ఈనాటి వైవాహిక వ్యవస్థలో మృగ్యమయింది. గృహ నిర్వహణ, సంతానపోషణ, ఆస్థి పెంపుదల, సతీపతులు తమ సెక్సు వాంఛలను తీర్చుకోవటము మాత్రం, దాంపత్య జీవితంలో చోటుచేసుకుంటున్నాయి. అంటే కేవలము సన్నిహితత్వానికిగాని లేక లైంగికతకుగాని పెద్దగా ప్రముఖ స్థానం లేకుండా పోయింది. ఈ రెండూకాకుండా మిగతా అంశాలకు ప్రాధాన్యత వచ్చింది. ఇది ఈనాటి స్థితి.

అసలు స్త్రీకి లైంగికస్వేచ్ఛ వున్నదా లేదా అనే అంశాన్ని పరిగణిస్తే స్త్రీ పురుషులు లైంగికంగా ప్రవర్తించగలరు. ఒకానొకప్పుడు, అంటే జంతుదశ నుండి అప్పుడే మానవదశలోకి వచ్చినపుడు స్త్రీ పురుషుల లైంగిక సంబంధాలకు కట్టుబాట్లు ఉండేవి కావు. క్రమంగా కొన్ని సముదాయాలకు పరిమితం కావడం, కొన్ని సముదాయాలను కాదని వేరే సముదాయాల వారితో సంబంధాలు ఏర్పరచుకోవడం జరిగింది. ఇలా కులంలోనే వివాహాలు, గోత్రాల వెలుపల వివాహాలు వెలిశాయి.

ఆరోగ్యశాస్త్ర జ్ఞానం పెరిగిన కొలదీ రక్త సంబంధీకులమధ్య సంబంధాలను నిరుత్సాహపరచటం జరిగింది. మానవజీవితంలో ఉద్వేగాలు, భావాలు ఎక్కువగా పని చేస్తాయి. దాంతో వివాహంవల్ల ఏర్పడిన బంధుత్వాలను కూడా గౌరవించడం అలవాటయింది. భార్య తల్లితో సంబంధం గర్హనీయమయింది. ఇలా వైవాహిక సంబంధాల విషయంగా విధినిషేధాలు చోటుచేసుకున్నాయి. లైంగిక సన్నిహితత్వం దంపతుల మధ్య మాత్రమే ధర్మమని పేర్కొనడంతో లైంగికస్వేచ్ఛకు పరిమితులు వచ్చాయి. అయితే ఇది పురుషాధిక్య సమాజం కావడంతో బహు భార్యాత్వం ఆదరణీయమయింది. అంతేగాక ఉంపుడుగత్తెను ఉంచుకోవటం రసికత క్రింద చలామణీ చేయించారు స్వార్థపరులయిన పురుషపుంగవులు. దీంతో స్త్రీల స్థితి దయనీయమయింది. ఆమెకు పాతివ్రత్యమనే సంకెళ్ళు వేయటం వలన ఆమె భర్త ఆమెను నిరాదరణ చేసినా, ఆమె తన జీవితాన్ని నికృష్టంగా బాధగా గడపవసిందే తప్ప మరో గత్యంతరం లేకపోయింది. వివాహాన్ని విచ్ఛిన్నం చేయటానికి విడాకులు అసలు లేవు. కనుక స్త్రీకి మార్గాంతరం ఏమిటి అనే ప్రశ్న ఉదయించింది. పలువురు స్త్రీలు పలువిధాలుగా తమ జీవితాలను సరిదిద్దుకున్నారు. ఎక్కువమంది తమ కర్మ ఇంతే అని తలపోసి పతి మొగము చూపక పోయినా ఇల్లాండ్రుగా నిలిచిపోయారు. మరికొందరు ఆత్మహత్యలకు పాల్పడ్డారు. ఇంకా కొందరు రహస్య వ్యభిచారానికి ఉపక్రమించారు. ఏ కొలదిమందో ఇల్లు వెడలి పరాయి ప్రాంతాలకు వెళ్ళి వేశ్యావృత్తిని చేపట్టారు. ఇలా వారు తమ తమ లైంగికపరమైన సమస్యలను అనేక రకాలుగా పరిష్కరించుకున్నారు.

పరిస్థితులు మారాయి. విడాకులకు అవకాశం వచ్చింది కాని అన్ని సమాజాలలోనూ దానికి గల అవకాశాలు ఒకటిగా లేవు. అందుతో మత సమాజాల పరిస్థితి మరీ విచిత్రంగా ఉంది. భారతదేశంలో క్రైస్తవుల స్థితి ఈ సందర్భంగా మరీ దారుణంగా ఉంది. హిందువులు మత ధర్మశాసనం ఈ సందర్భంగా కాస్త మెరుగయినా దంపతులలో ఏ ఒక్కరికయినా దాంపత్య జీవితం కొనసాగించడం ఇష్టం లేకపోతే వెంటనే విడాకులు ఇచ్చే అవకాశం లేదు. అసలు స్వేచ్ఛను అన్వయం చేసుకొంటే, ఈ దేశంలోని మత ధర్మ శాసనాలు, సర్వ సామాన్య శాసనాలుకూడా లోప భూయిష్టంగా ఉన్నాయి. విడాకులు లభించడం కష్టమయినపుడు, అవి లాంఛనప్రాయంగా ఉన్నప్పుడు ఇంచుమించుగా విడాకులు లేని స్థితి కొనసాగుతుంది. పైన వివరించినవన్నీ ఇక్కడా ప్రత్యక్షమవుతాయి.

తేలికగా విడాకులు లభించే సమాజంలో కృత్రిమ సంబంధాలకు, అసహజత్వానికి, కుత్సితానికి, అన్యాయానికి తావు ఉండదు. ఇష్టంలేని దాంపత్య జీవితం నుండి భార్యాభర్తలు విడిపడతారు. అంతేకాని ఒకరికి తెలియకుండా మరొకరు ఇతరులతో లైంగిక సంబంధాలను పెట్టుకోరు. ఇది కొంతవరకు మెరుగయిన పరిస్థితి.

**వివాహం వెలుపల లైంగిక సంబంధం :** ఇరువురు వివాహంచేసుకున్నేటప్పుడు సాధారణంగా ప్రమాణాలు చేస్తారు. 'కలిమి లేములతో, కష్టసుఖాలలో ఒకరికొకరు చేదోడు వాదోడుగా ఉంటూ సహచరులుగా, స్నేహితులుగా, ప్రేయసీ ప్రియులుగా: భార్యాభర్తలుగా జీవయాత్ర సాగిద్దాము, అనే ప్రమాణం సర్వసాధారణంగా కనిపిస్తుంది. వివాహానికి వెలుపల లైంగిక సంబంధం పెట్టుకోవడం ఈ ప్రమాణాన్ని అతిక్రమించడం కాదా అనే సంశయం వస్తుంది. అంటే తన తను ధన మనః ప్రాణాలను ఒకరు మరొకరికి అర్పించుకోవాలని అర్థం స్ఫురిస్తున్నది. వాస్తవానికి భార్యాభర్తలు ఇరువురు వ్యక్తులు. వారి దేహాలు వేరు. మానసిక ప్రవృత్తులు వేరు, మనస్సులు వేరు. కాగా కొన్ని ఆకర్షణలవల్ల – అది కామం వల్ల కావచ్చు, మోహం వల్ల కలుగవచ్చు లేక ప్రేమ వల్ల ఉత్పన్నం కావచ్చు, వారు వైవాహిక బంధంలోకి జొరబడ్తారు. ఇటీవల కొన్ని దేశాలలో వివాహతంతును వదలివేసి స్త్రీ పురుషులు దంపతులుగా జీవిస్తున్నారు. దాంపత్య సంబంధంలోగాని వైవాహిక సంబంధంలోగాని సంబంధాలు మానసికంగా ఇంచుమించుగా ఒకటే. కాకపోతే వివాహం చేసుకోని దంపతులు విడిపోవటం తేలిక, దానికి తంతు అక్కర లేదు. శాసనపు ఆసరా అసలే అవసరం లేదు. ఒకరికి మరొకరిపై హక్కులు బాధ్యతలు ఉండవు. ఇంత తేడా కన్పడుతున్నా వారి ఆశలలో, ఆశయాలలో సామ్యత ఉంది. ఒకరు మరి ఒకరి యెడ విశ్వాసంతో, నమ్మకంతో నిజాయితీగా ప్రవర్తించాలని ఇరువురూ ఆశిస్తారు. వివాహం వెలుపల దాంపత్యం వెలుపల లైంగిక సంబంధాన్ని హర్షించరు. ఈ పరిస్థితిని అర్థం చేసుకోవాలి. అంటే స్త్రీ గాని పురుషుడుగాని బైటి సంబంధాలు ఆశించటం నమ్మకద్రోహమన్న మాట.

లైంగికత యొక్క స్వరూపాన్ని అర్థం చేసుకుంటే తప్ప ఈ సమస్యను సరిగా అవగాహన చేసుకోలేము. స్త్రీ పురుషుల సంయోగాన్ని కేవలం భార్యాభర్తలకు ఎందుకు పరిమితం చేయబడింది ? తరచి చూస్తే ఫలాని సంతానం ఫలాని

పురుషునిది అనే నిర్ధారణకోసం ఈ నియమం ఏర్పడిందని కొందరు సామాజిక శాస్త్రజ్ఞుల ఊహ. ఒకప్పుడు సంతానాన్ని ధర్మజులని, కామజులని వర్గీకరణ చేసారు. సంతానం కోసమే దాంపత్య జీవితం సాగించాలని ధర్మోపదేశాలు చేశారు. ఈనాడు జన్మ నిగ్రహ సాధనాలు ప్రజలకు అందుబాటులోకి రావడం వల్ల కుటుంబ నియంత్రణ సాధ్యమయింది. కనుక సంతానప్రాప్తి భయంలేని దాంపత్యాలు, దాంపత్య జీవితంతో సంబంధంలేని సంతాన యోగ్యత సంభవమయినాయి. ఈ పరిణామాల ఫలితంగా స్త్రీ లైంగికత ఇన్నాళ్ళుగా కట్టుదిట్టాలలో ఉండి ఇపుడు స్వతంత్ర ప్రతిపత్తి కలిగి యుండటానికి అవకాశం కల్గింది. స్త్రీ కూడా మానవి, కనుక ఆమెకు కూడా ఇష్టాయిష్టాలు ఉంటాయనే భావాలు పొడచూపినయి. స్త్రీలు ధైర్యంగా బహిరంగంగా ఈనాడు తమ లైంగికతను గురించి మాట్లాడగల ధైర్యాన్ని అలవరుచుకున్నారు.

ఇటీవల స్త్రీపురుషుల సంబంధాలలో వినూత్న రీతులు వెలిశాయి. దంపతులుగా ఉంటూనే ఇరువురు ఇతరులతో లైంగిక సంబందాలు కలిగిఉండే విధానం ఇటీవల పాశ్చాత్య సమాజంలో పుట్టి కొనసాగుతున్నది, ఈ సంబంధాలను ఒకరికి తెలియకుండా మరొకరు సాగించరు. రహస్య ప్రవర్తనను వారు నిరశిస్తున్నారు. దీనిని బహిరంగ వివాహ బంధం **(Open Marriage)** అని పిలుస్తారు. ఈ దాంపత్యాలు సాగే చిన్న చిన్న కూటములలో అసూయ ద్వేషాలు నెలకొంటాయా లేదా అనేది వివాదాంశంగా మిగిలిపోయింది. ఇదమిద్ధమని తేల్చి చెప్పగల పరిస్థితి ఇంకా రాలేదు.

మరొక అంశం గమనార్హం, దాంపత్యాన్ని కొనసాగిస్తూనే కొందరు తాత్కాలికంగా కొన్ని సందర్భాలలో కొన్ని సన్నివేశాలలో స్త్రీలుకాని పురుషులు కాని భిన్నలింగానికి చెందినవారితో సంపర్కం పెట్టుకోవడం సంభవిస్తున్నది. ఇదీ పాశ్చాత్య సమాజంలో మాత్రమే కన్పించే విషయం. ఇలా తన భర్త లేక సహచరుడు ప్రవర్తించాడని భార్యకు లేక సహచరికి, భార్యలేక సహచరి ప్రవర్తించిందని భర్తలేక సహచరునికి సాధారణంగా తెలియకపోదు. తెలిసినా వారు దాని విషయమై పెద్దగా పట్టించుకోరు. దాంపత్య జీవితానికి అవసరమైన ఆప్యాయత, అనుకూల్యత, అనురాగం, దాంపత్య ధర్మనిరతి ఏలోపం లేకుండా సాగిపోతూ ఉన్నపుడు ఈ చిన్న చిన్న సంఘటనలపై దృష్టి సారించుకొని జీవితాలను దుఃఖభాజనం చేసుకోవటం వారికి ఇష్టం ఉండదు. దీనిని 'వివాహం వెలుపల సెక్సు

అనుభవం (Extra Marital Sex) అని పేర్కొనడం కద్దు.

మరొక స్త్రీ పురుష సంబంధరీతి కొనసాగుతున్నది పాశ్చాత్య ప్రపంచంలో ఒకస్త్రీ ఒక పురుషునితో దాంపత్య జీవితము లేక వైవాహిక జీవితం సాగిస్తూనే అలాగే ఒక పురుషుడు ఒక స్త్రీతో ఉంటూనే కొంతకాలం ఆరునెలలో, సంవత్సరమో, లేక నాలుగు అయిదు సంవత్సరాలో వేరొక పురుషునితో కాని స్త్రీతోకాని ప్రేమ సంబంధం (Love Affair) నెలకొల్పుకోవటమనేది ఈ పద్ధతి. దీనిలో రహస్యం తప్పక ఉంటుంది. కాపురం చేసే వ్యక్తికి తెలియకుండా సాగుతుంది ఈ వ్యవహారమంతా. అందువలన అనేక చిక్కులు, ఇబ్బందులు కల్గుతాయి. ఒకే సమయంలో, కాపురం చేస్తున్న వ్యక్తిని వదులుకోలేని స్థితి, అలాగే ప్రియుని లేక ప్రియురాలిని కాదనలేని స్థితి. ఈ ప్రేమైక సంబంధాలవల్ల సంతానాన్ని కనక పోవచ్చును. కాని ఉద్వేగ పరమైన గట్టి సంబంధం మాత్రం ఉంటుంది. అందుచేత అలా ప్రవర్తించే స్త్రీ పురుషులు మానసిక ఉద్రిక్తతకు లోనవుతారు. ఈ ప్రమాదం ఉన్నా ప్రేమ తీవ్రత లోపిస్తున్న దాంపత్య జీవితాన్ని సుసంపన్నం చేసుకోవటానికి సాహచర్యం అవసరమేననే వాదన లేకపోలేదు.

స్త్రీ పురుషుల స్వైర విహారం అనేది (Promiscuity) అనేదానిని ఈ శీర్షిక క్రింద చర్చించనవసరం లేదు. ఈరకపు ప్రవర్తనకు బంధాలు, పరిమితులు ఉండవు కనుక వివాహం లేక దాంపత్యం అనే ప్రసక్తిరాదు.

ఇంతకూ వైవాహిక జీవితంలో, దాంపత్య జీవితంలో స్త్రీకి లైంగికస్వేచ్ఛ ఉంటుందా లేదా అనే అంశం ప్రస్తుత చర్చనీయాంశం. స్వేచ్ఛకు సంపూర్ణత, పరమస్థితి (Absolute) ఉంటుందా అనేది వివాదాంశం. స్వేచ్ఛ సాపేక్షమని (Relative) చాలమంది వాదన. అలాంటప్పుడు స్త్రీపురుషులు విషయాలను తెలుసుకొని, కళ్ళు తెరచుకొని, వైవాహిక బంధంలోకి లేక దాంపత్య బంధంలోకి ప్రవేశించినపుడు వారు వారి స్వేచ్ఛను కొంతగా కొంత కుదించుకోవటానికి అంగీకరించారని అర్ధమని కొందరు వాదిస్తున్నారు కనుక వివాహానికి వెలుపల, దాంపత్యానికి వెలుపల మరో పురుషునితో, స్త్రీతో సంబంధం పెట్టుకోవడమనే ప్రసక్తి రాకూడదని కొంతమంది అభిప్రాయం. అలాకాక ఇద్దరు స్త్రీపురుషులు వివాహానికి లేక దాంపత్య జీవితానికి సిద్ధపడినా వారి తనువులు మనస్సులు వేరు వేరు కనుకను, ఒకరు మరి ఒకరి యజమానులు, స్వంతదారులు కారు కనుక వేరొకరి దేహాలపై, మనస్సులపై

ఒకరికి యాజమాన్యపు హక్కులు ఉండవని మరియొక వాదన. కనుక వారిన మానసిక ప్రవృత్తులు వారి అభీష్టాలకు అనుగుణంగా మాత్రమే ఉంటాయని, ఉండాలని సిద్ధాంతం. అందుచేత పురుషుడు స్త్రీయొక్క లైంగికతను, స్త్రీపురుషుని లైంగికతను నియంత్రణం చేయటానికి శాసించటానికి అవకాశము ఉండరాదని సూత్రం. ఈ పద్ధతిలో సెక్సు అనుభవానికి ప్రాముఖ్యత ఉండదు. మానసిక వైఖరికి, సన్నిహితత్వం అపేక్షకు ప్రాధాన్యత వుంటుంది. ఈవైఖరి సరైయైనదా, న్యాయమైనదా, ధర్మయుతమా, నీతివంతమా అనే అంశాలను సుదీర్ఘంగా చర్చించాల్సి ఉంటుంది.

# స్త్రీ లైంగిక స్వేచ్ఛను కుదించే అంశాలు

స్త్రీ పురుషులు వేరు వేరు లింగాలకు చెందిన మనుష్యులు. శారీరక, మానసిక శక్తుల విషయంగా ఇంచు మించుగా వారిరువురూ సమానులు. కాక లైంగికతను ప్రకటించే సందర్భంలో మనం ఆచరణలోకి తెచ్చే విషయంగా వారిరువురూ సమాన స్థాయిలో హక్కులను అనుభవించడం లేదు. అందువల్ల సగంమంది మానవులు స్వేచ్ఛను కోల్పోయి బానిస బ్రతుకులను కొనసాగిస్తున్నారు.

లైంగికేచ్ఛ అంశాన్ని తీసుకుంటే స్త్రీ పురుషుల సమానత్వం హుళక్కి అవుతుంది? మానవులు జీవ పరిణామ క్రమంలో వానరజాతినుండి ఉద్భవించడం వల్ల వారికి జంతు వాసనలు ఉండటంలో ఆశ్చర్యం లేదు. ఆహార, నిద్ర, మైథు నాలు జంతువులకు సామాన్య ధర్మాలు. కామాన్ని చతుర్విధ పురుషార్థాల వరుసలోకి చేర్చారు ధర్మశాస్త్ర పారంగతులు. కామం మానవ జాతికి సామాన్య వాసనగా బల పడింది. అందువల్లనే స్త్రీ పురుషులు కామతృప్తిని పొందదగు సన్నివేశాలను, సమ యాలను, సందర్భాలను సమాజం క్రమబద్ధం చేయటానికి ప్రయత్నిస్తున్నది. ఆయా దేశాల నాగరికతను, వాతావరణాన్ని దృష్టిలో వుంచుకొని అనేక దేశాల్లో, అనేక ప్రాంతాల్లో వేరు వేరు కట్టుబాట్లు వెలసి కామవాంఛ పురుషులకన్నా స్త్రీలకు ఎక్కు వని భారతదేశ ధర్మశాస్త్ర కోవిదులు సెలవిచ్చారు. దీని వాస్తవా వాస్తవాలను గురించి తర్క వితర్కాలు చేసే దానికన్నా స్త్రీలకు కామవాంఛ వుంటుందని అంగీ కరించి విషయ చర్చకు ఉపక్రమించడం మంచిదేమో! భోగలాలసత్వానికి ప్రత్యే కంగా కేటాయించబడిన వేశ్యా జాతిలో స్త్రీలకు తప్ప మరి ఇతర మహిళలకు కామ వాంఛ వెలిబుచ్చుటను సిగ్గులేని చర్యగా అభివర్ణించడం జరిగింది. అందుచేత కుల స్త్రీ తన కామవాంఛను అణిచి వేసుకునే పరిస్థితి సంభవించింది.

లైంగిక స్వేచ్ఛను పరిశీలించాలంటే స్త్రీల కామవాంఛ ఫలసిద్ధి అవకాశాలను పేర్కొని క్షుణ్ణంగా చర్చించాలి. అనుభవానికి అవకాశంలేని హక్కు వుండీ లేనట్లే. భారత స్త్రీల పరంగా ఆలోచిస్తే వారి లైంగిక స్వేచ్ఛ ఏనాడూ ప్రకటింప బడలేదు. ప్రకటనకే నోచుకోని హక్కు అనుభవానికి ఏ పాటికి వస్తుంది ?

స్త్రీల కామవాంఛ వైవాహిక జీవితంలోనే సిద్ధి పొందాలా. అక్కర్లేదా అనే ధర్మమీమాంస పోకుండానే దానిని గురించి ఇతరత్రా చర్చించవచ్చు.

స్త్రీల లైంగిక స్వేచ్ఛను అరికట్టేవి, తగ్గించేవి అనేక అంశాలు వున్నాయి. వాటిని గుర్తించటం, పేర్కొనడం అవశ్య కర్తవ్యం. ఇవి వివిధ రూపాలలో

దర్శనమిస్తున్నాయి. సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక రాజకీయ ప్రతిబంధకాల వర్గీకరణతో వాటిని ఉటంకించడం యుక్తియుక్తం. మరొక పద్ధతిలో కూడా ఈ విషయాలు వర్గీకరణ చేయవచ్చును. వివిధ వర్గాలకు సముదాయాలకు చెందిన వారిగా స్త్రీలను పరిగణించి చర్చించడం మరో పద్ధతి.

స్త్రీలకు వివాహం ముఖ్య సంస్కారంగా పేర్కొనడం జరుగుతున్నది. వైవాహిక జీవితంలో భర్తయే యజమాని. అతడు కోరినపుడు భార్య తన శరీరాన్ని అతనికి వప్పచెప్పాలి. ఆమె ఇష్టాయిష్టాలతో అతనికి నిమిత్తం లేదు. ఆమెకు కామ వాంఛ కలిగినా దానిని తీర్చవలసిన బాధ్యతను అతడు తీసుకోవటం లేదు. కనుక చాల కుటుంబాలలో భార్యలకు లైంగిక స్వేచ్ఛ లేదు.

పురుషుడు తన భార్యతోనే కాక ఇతరత్రా అనేకమంది స్త్రీలతో లైంగిక సంబంధాలను కల్పించుకుంటున్నా అతనిని సమాజం చిన్నచూపు చూడటం లేదు. 1955వ సంవత్సరం వరకు హిందూ సమాజంలో బహు భార్యాత్వం శాసన సమ్మతంగా ఉండేది. ఈనాడు కూడా భారతీయ ముస్లిం సమాజంలో బహు భార్యాత్వం అమలులో ఉంది. అంటే పురుషులకు విపరీతమయిన లైంగిక స్వేచ్ఛ ఉంటున్నదన్నమాట. స్త్రీలకు అది నిరాకరింపబడుతున్నది.

వివాహాన్ని తప్పని సరియైన సంస్కారంగా ప్రకటిస్తున్నా ఈనాడు ప్రతి స్త్రీకి వివాహ యోగ్యత కలగటం లేదు. ఈ ధనస్వామ్య వ్యవస్థలో మానవ విలువలు కూడా ధనానికి లొంగిపోతున్నాయి. కట్నంచెల్లించలేని స్త్రీ ఎంత విద్యావంతురాలయినా, స్ఫురద్రూపి అయినా, సుగుణవంతురాలయినాకన్యగామిగిలిపోతున్నది. ఆమె అవివాహిత కనుక ఆమె పురుషులతో లైంగిక సంబంధం పెట్టుకోరాదన్న సామాజిక నియమము ఈనాడు అమలులో ఉంది. కన్యలను తప్పనిసరిగా తమ లైంగిక స్వేచ్ఛను వినియోగించుకుని అనేకమంది పురుషులతో లైంగికసంపర్కం నెరపమని ఎవరూ కోరరు. ప్రేమలేని చోట సెక్సు సంబంధాన్ని నెలకొల్పుకోవటాన్ని హర్షించరు కూడాను. కాని మౌలికమయిన ప్రశ్న అది కాదు. లైంగిక స్వేచ్ఛను వినియోగించుకోగల హక్కు ఆమెకు ఉన్నదా లేదా అనేదే మీమాంస. మూడవ వ్యక్తికి నష్టదాయకం కానంతవరకు, ఆమె వ్యక్తిత్వానికి భంగకరం కానంతవరకు, ఆమె అంగీకరించిన ప్రవర్తన నియమావళికి చేటు రానంతవరకు ఆమె తన లైంగిక స్వేచ్ఛను వినియోగించుకుంటే ఎవరికి అభ్యంతరం ఉండరాదు.

ఈనాడు సమాజంలో బలవంతపు వైధవ్యం సాగుతున్న మాట వాస్తవం బలవంతపు వైధవ్యంలోని కఠిన నియమాలు ఈనాడు గట్టిగా ఆచరణలోకి రాకపో యినా వైధవ్యం వలన కోల్పోయిన లైంగిక సన్నిహితత్వం అనే అంశం అలాగే ఉంది. 20వ శతాబ్దపు అంతంలో కూడా వితంతువు పునర్వివాహానికి సిద్ధపడినా ఆమెను వివాహమాడేవారు బహు స్వల్ప సంఖ్యలో దర్శనమిస్తున్నారు. ఆర్థిక రంగంలో, రాజకీయ రంగంలో విప్లవాత్మకమైన భావాలు వెలిబుచ్చే పురుషులుకూడా వివాహమాడటానికి వచ్చేసరికి కన్యయే వధువుగా కావాలని ఆశిస్తున్నారు. సెక్సును ఉదాత్తం చేసుకొని ఆ తద్వారా వచ్చిన శక్తిని సామర్థ్యాన్ని మరో ఆదర్శంకొరకు లక్ష్యం కొరకు వినియోగించేవారి సంగతి అలా ఉంచి కామాన్ని జయించలేని వారి గతి ఏమిటి ? స్వేచ్ఛను వినియోగించుకోటానికి అవకాశంలేని స్వేచ్ఛ ఉంటే యేమి లేకున్న యేమి ? రెంటి స్థితిగతులకు తేడా ఏమి లేదు. కన్యల పరంగా ఏ విధమైన ఆలోచనా క్రమం సక్రమంగా తోస్తున్నదో అదే వితంతువులకు వర్తిస్తుందని గమ నించాలి.

ఇక అనేకమంది స్త్రీలు తమ తప్పిదం లేకుండానే వ్యభిచారంలోకి నెట్టబడు తున్నారు, వారికి లైంగిక స్వేచ్ఛ ప్రసక్తి లేదు. భుక్తి గడవటానికి వారు శరీరాన్ని అమ్ముకుంటున్నారు. ఆలాంటప్పుడు తమ ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండానే వారు తమ లైంగిక సాంగత్యాన్ని పైసలివ్వగల పురుష పుంగవులకు అందిస్తు న్నారు. అంటే వారికి లైంగిక స్వేచ్ఛ లేదన్నమాట. పైకి వారు ఎంతో స్వేచ్ఛ ఉన్నవారిలాగా సంచరిస్తారు. నిజానికి వారి స్వేచ్ఛ మృగ్యం.

స్త్రీ తన లైంగిక స్వేచ్ఛను వాడకుండా సమాజం యొక్క సాంస్కృతిక వాతావరణం అడ్డునిలుస్తున్నది. పాతివ్రత్య భావన భారత స్త్రీల నరనరాన జీర్ణించి పోయింది. భార్యకు భర్తతోటిదే లోకం. అతడు ఆమెకు యజమాని, దైవం. అతడు చనిపోయినా ఆమె అతనిని స్మరిస్తూ జీవించాలి. అదే వైధవ్య వ్రత అంత రార్థం. భార్యాభర్తల సంబంధం అవిచ్ఛిన్నం. ఇహ పరాలను రెంటిని ముడివేసేది. వేయి జన్మలకైనా ఆ భర్తని భర్తగా పొందాలని పతివ్రత ఆశించాలట. భర్త భ్రష్టుడైనా, క్షుద్రుడైనా, కుత్సితుడైనా, పాపియైనా భార్య అతనిని దైవసమానునిగా భావించి సేవించవలెనట. ఇంకెక్కడి లైంగిక స్వేచ్ఛ ?

అసలు వివాహం ఎందుకు? సంతానాన్ని పొంది మానవజాతిని పెంపొందించ

డానికే అని చెప్పారు. అలాంటి ఉద్దేశ్యముతో కన్న సంతానం ధర్మజులని పిలువ బడుతుంది. తతిమ్మా సంతానం కామజులు. కామజులు ధర్మజుల కన్న హీనులు, తక్కువశ్రేణివారు అంటే వైవాహిక దశలో కూడా కామానికి తక్కువ హోదా ఇవ్వబడిందన్న మాట. ఇలా బోధించబడిన స్త్రీ ఎలా తన కామవాంఛ తీర్చమని భర్తను కోరగలదు ? కనుక లజ్జావినయాలు ఆమెకు భూషణాలుగా వర్ణింపబడినవి. ఆమె తన కోరికను చంపుకోవలసిన పరిస్థితి ఏర్పడింది.

అర్థిక స్వాతంత్ర్యం ఉంటే ఇతరత్రా స్వేచ్ఛ సమకూడుతుందనే భావం ప్రబలంగా వుంది. ఉద్యోగినులైన స్త్రీలు, కాయకష్టం చేసి సంపాదించే స్త్రీలు పైకి ఆర్థిక స్వాతంత్రం ఉన్నట్లే కన్పడతారు. కాని నిజానికి వారికా స్వేచ్ఛ లేదు. వారు జీతాలను, కూలి పైకాలను తమ భర్తల పాద పద్మాలచెంతన ఉంచవలసి వస్తున్నది. సామాజిక సాంస్కృతిక స్వాతంత్ర్యం మృగ్యమయినపుడు కేవలం ఆర్థిక స్వాతంత్ర్యం నిరుపయోగమవుతున్నది. అందతో కొంత తెగువ, సాహసం చొరవ ఉన్న మహిళల విషయంతో అందులో ముఖ్యంగా కన్యలు, వితంతువుల పరంగా ఆర్థిక స్వాతంత్ర్యం వారికె స్వేచ్ఛను మరికొంత కలిగిస్తున్నది. అలాగే వారు ఇచ్ఛగిస్తే తమ లైంగికస్వేచ్ఛను కించిత్తుగా అనుభవించగలరు. ఇది సైద్ధాంతికంగా చెప్పే అంశం కాని ఆచరణ విధానాలు వేరుగా ఉంటున్నాయి.

సంతానం కావాలన్నా, వద్దన్నా, ఎంతమంది పిల్లలు కావాలో అవన్నీ భర్త మాత్రమే నిర్ణయిస్తున్నాడు. ఈ విషయంలో తన స్వేచ్ఛను వినియోగించుకున్న ఇల్లాలు ఇంటినుండి బయటికి గెంటివేయబడుతుంది. భర్తకు అత్యంత ప్రీతి పాత్రమయిన సంతానం విషయంలోనే స్త్రీ స్వేచ్ఛ అంతంత మాత్రంగా ఉంటే లైంగిక స్వేచ్ఛ విషయం వేరుగా పేర్కొనవలసిన పనిలేదు.

ఇక రాజకీయ ప్రతిబంధకాలను గురించి చర్చిద్దాము. శాసనాలను చేసేది శాసనసభ, అమలుపరిచేది పోలీసుయంత్రాంగం. దాని పనితీరు శాసన సమ్మతంగా ఉందా లేదా అని తేల్చేది న్యాయస్థానం. బహు భార్యాత్వం శాసనబద్ధమైన ముస ల్మాను సమాజంలో భర్త కేవలం మరొక స్త్రీని వివాహమాడాడనే కారణాన భార్య అతనినుండి విడాకులు కోర వలను పశదు. తనను నిరాదరణచేసి మరల ఇంకొక వనితను పెండ్లాడినభర్తకు అమె శయన సౌఖ్యం అందించాలి. ఇదాలైంగికస్వేచ్ఛ.

భార్యాభర్తలు ఒకే ఇంట్లో కాపురముంటూఉంటే భర్త భార్య ఇష్టాయిష్టాలతోనిమిత్తం లేకుండా ఆమెను చికాకు పరిస్తే అది నేరంకాదు. అలాకాక ఆమె కోర్టు ఉత్తర్వుల మేరకు విడిగా ఉండటానికి (**Judicial Seperation**) అనుమతి పొంది వేరుగా జీవిస్తూ ఉంటే భర్త ఆమెపై మానభంగం సాగిస్తే అతనికి రెండే రెండు సంవత్సరాలు శిక్ష. భార్యగా ఉన్న స్త్రీయొక్క లైంగికస్వేచ్ఛకు శాసనం, రాజకీయవ్యవస్థ విలువ ఇవ్వటంలేదని తేలిపోయింది. మరోవిషయం, ఒక మగనాలు పరపురుషునితో వ్యభిచరిస్తే భర్త కేసు పెడితే పరపురుషుడ్ని జైలుకు పంపుతారు భారత శిక్షాస్మృతి **I. P. C** సెక్షను 497 ప్రకారం. పరపురుషుడు నేరస్తుడు. ఇతరుల భార్యతో కూడటం అతని నేరం. కారణం ఆమె, ఆమె భర్త సొత్తు. ఈ భావాలు ఆ శిక్షా స్మృతి నిబంధనల అంతరార్థం. సొత్తుకు స్వేచ్ఛ ఎలా వుంటుంది? ఒకవేళ మరో రకమయిన స్వేచ్ఛ ఉన్నా లైంగికస్వేచ్ఛ ఎక్కడుంటుంది?

చివరకు పడుపువృత్తిలో కూడా సుఖాలు పురుషులవి, దుఃఖాలు స్త్రీలవి. 1986 వరకు అవినీతి నిర్మూలన శాసనంక్రింద స్త్రీలుమాత్రమే శిక్షార్హులు. ఇప్పుడు ఇరువురినీ శిక్షార్హులను చేసింది శాసనం. పరిస్థితుల ప్రాభవం వలన, వాతావరణ ప్రాబల్యం వల్ల వ్యభిచారుల స్థాయికి దిగజార్చబడిన స్త్రీలకు శిక్షలెందుకో?

చిట్టచివరగా మరొక అంశాన్ని ముచ్చటించవలసి యున్నది. దంపతులలో ఒకరు మరియొకరిని కాపురానికి రమ్మనమని కోర్టుద్వారా అభ్యర్థించవచ్చును, కోర్టు వారికి అది న్యాయమని తోస్తే రెండవ వారికి వ్యతిరేకంగా తీర్పునివ్వవచ్చును. దీని వల్ల ఎవరికీ నష్టంలేదని కొందరు వాదించవచ్చును. ప్రతివాది కోర్టు ఉత్తర్వుప్రకారం నడుచుకోకపోతే బలవంతాన ప్రతివాదిని వాది శయనమందిరంలోకి కోర్టు నెట్టదనే మాట సత్యమే. కాగా ప్రతివాదిని ఇతరత్రా బలవంతం చేసే నిమిత్తం ఆమె ఆస్తిని కోర్టువారు జప్తు చేసి వేలం వేయించగలరు. అంటే ఆమె ఆర్థిక అస్తిత్వాన్ని దెబ్బ తీయగలరు. ఇది పరోక్షమయిన హింస, దౌర్జన్యం కాక మరేమిటి? స్త్రీ వ్యక్తిగా మనసున్న మనిషిగా, కోరికలున్న మానవిగా బ్రతకగలిగేదెప్పుడు? ఆమె లైంగిక స్వేచ్ఛకు ఇలాంటి శాసనాలు, చర్యలు ప్రతిబంధకాలే కాక గొడ్డలిపెట్టు కాదా?

ఇలా సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక రాజకీయ ప్రతిబంధకాలను గుర్తించి చర్చించిన తరువాత కొన్ని ప్రజాసముదాయాల కష్టనిష్టూరాలను గురించి విచారిం

చటం న్యాయం. సమాజంలో కన్యలు, వితంతువులు, వృద్ధులు, వికలాంగులు,వ్యాధి గ్రస్తులు స్త్రీ పురుషులిరువురిలో ఉన్నారు. వారి కామేచ్ఛను గురించి దాని ఫలిసిద్ధిని గురించి పరిశీలించాలి. కన్యలు, వితంతువుల విషయం ఇంత క్రితం ప్రస్తావించడం జరిగింది.

వృద్ధుల విషయంలో చాలామందికి పొరపాటు అభిప్రాయాలున్నాయి. వృద్ధులకు సంబంధించిన శాస్త్రం (Gerontology) ఇటీవల బాగా వృద్ధి చెందింది ప్రజల దృష్టికి వచ్చింది. దశకం దశకానికి తేలిన లెక్కలప్రకారం దేశదేశాల జనాభాలలో సగటు జీవిత పరిణామం పెరుగుచున్నది. వృద్ధుల శక్తియుక్తులు, సామర్థ్యా పాటవాలు సమాజాల మన్నను పొందుతున్నాయి. ఈ సందర్భంగా వృద్ధుల యోగక్షేమాలు ఆసక్తిదాయకాలు అవుతున్నాయి. వృద్ధులకు కూడా కామ వాంఛ ఉంటుందనే విషయాన్ని శాస్త్రజ్ఞులు అంగీకరిస్తున్నారు. కాకపోతే యువతీ యువకుల కామవాంఛా ఫలసిద్ధి మార్గాలు, వృద్ధుల అవకాశ విధానాలు వేరు వేరు కావచ్చు. వృద్ధుల సాంగత్యానికి, సన్నిహితత్వానికి ప్రాధాన్యత ఉండటం కద్దు. అయితే బాధాకరమయిన విషయమేమంటే వృద్ధులకు కామవాంఛ ఉండరాదనే సూత్రాన్ని పలువురు గృహస్తులు, ఇల్లాళ్ళు ప్రచారంసాగిస్తున్నారు. పిల్లలు, మనుమలు, మనుమరాండ్రు ఉన్న ముసలమ్మను ఆప్యాయంగా దగ్గరకు రమ్మనమని ముసలి భర్త అభ్యర్థిస్తే ఆమె బుగ్గలు నొక్కుకుంటుంది. అలా భర్త దరిచేరటం విడ్డూరమైన పనియని, విపరీత కార్యమని ఆమె ఉద్దేశ్యము, ఆమె సంతానంయొక్క ఉద్దేశ్యం కూడాను. దీనివల్ల ఆ ముసలాళ్ళు ఆప్యాయంగా ఒకరికొకరు ఒరుసుకుని సేదార్చుకోవడం జరుగదు. చివరకు ముసలాళ్ళు ముడుచుకొనిపోయి జీవితాలను యాంత్రికంగా కొనసాగిస్తారు, ఇలాంటిపరిస్థితి వారికి ప్రమాదకరం. వారి మానసిక సమతుల్య స్థితి తల్లక్రిందులవుతుంది.

ఇక వికలాంగులు, వ్యాధిగ్రస్తులు వీరి విషయమూ అలాంటిదే. మనిషికి ఒక శరీరావయవ విషయంగా లోపం వుండవచ్చు. లేక ఒక రకమైన వ్యాధికి లోను కావచ్చు. సంతానాన్ని పొందటం, లైంగిక జీవితం గడపటం ఈనాడు విధిగా పరస్పరాధేయాలు కాదు. సంతానప్రాప్తి భయంలేకుండా కాముక వ్యాపారం స్త్రీ పురుషులమధ్య జరగడానికి అవకాశం వుంది. దాంతో బలహీనపు సంతానం, వ్యాధిగ్రస్తులయిన పిల్లలు కలుగుతారనే భయం నశించింది. అలాంటపుడు పై చెప్పిన

సముదాయాలకు చెందిన స్త్రీ పురుషులకు, అంతగా అవసరమయితే సంతాన యోగ్యత లేకుండాచేసి, లైంగికంగా సన్నిహితంగా మెలగనివ్వటం న్యాయంకాదా? ఇంతకూ మానవునిలో ఉండే అలసత్వం, అజ్ఞానం, మౌఢ్యం ఇలాంటి జీవులను దుఃఖసముద్రంలోకి నెట్టివేస్తున్నాయి.

స్త్రీ పురుషుల లైంగిక ప్రవర్తనారీతులు వైవిధ్యంతో కూడి ఉంటవి. కొన్ని ప్రకృతిపై ఆధారపడతాయి. మరికొన్ని సమాజ సంస్కృతివల్ల ప్రభావితమవుతవి. ఏకలింగసంపర్కం. ఆసనంద్వారా సెక్సు, నోటిద్వారా సెక్స్, పశువులతో సంపర్కం ఇలాంటివి సర్వసామాన్యమైన లైంగిక వ్యాపార ప్రకటనారీతులకు భిన్నం. వీటిని శాసనం ద్వారా నిషేధించాయి సమాజాలు. బ్రిటిషు శాసనాలను అనుసరించి వ్రాయబడిన భారత శిక్షాస్మృతిలోని 377వ సెక్షను ఇలాంటి చర్యకు 10 సంవత్సరాల శిక్షను నిర్దేశించింది. కాలం మారుతున్నది. ఏకలింగ సంపర్కాన్ని అనుసరించే వారి సంఖ్య, సమర్థించేవారి జనాభా పాశ్చాత్య సమాజాలలో పెరిగింది. దాంతో శాసనం మారింది అచట. భారతదేశంలో ఆ సెక్షను అలాగే వుంది. నిజానికి ఈ సమస్య భారతీయులను అంత ఎక్కువగా బాధించటంలేదు. అయినా మానవుల స్వేచ్ఛకు భంగకరమయ్యే ఏ శాసనమూ నిల్వలో ఉండటం మంచిది కాదు. మరొకరికి బాధాకరమో, నష్టదాయకమూ కాని రీతిలో స్త్రీ పురుషులు అనుసరించే లైంగిక ప్రవర్తనను నియంత్రించేయటం, చేయతలచటం అవివేకం, అనుచితం. శిక్షాస్మృతిలోని 377వ సెక్షనును తొలగించాలి.

స్త్రీల లైంగిక స్వేచ్ఛను అరికట్టే అంశాలను గురించి, లేక కనీసం స్వేచ్ఛకు అవకాశాలను తగ్గించే సందర్భాలనుగురించి విశదంగా నిర్మొహమాటంగా వివరించటం జరిగింది. ఇలాంటి చర్చలు, గోష్ఠులు మానవ సముదాయాలలో అన్ని స్థాయిలలో ఎంత ఎక్కువగాజరిగితే మానవాళికి అంత మంచిది; అంతగా ఆనందదాయకంగా మనగల్గటం నేర్చుకుంటుంది.

# స్త్రీ లైంగిక స్వేచ్ఛను పెంచే అంశాలు

మారుతున్న కాలంలో మహిళల లైంగిక స్వేచ్ఛను పెంచే అంశాలు తెలియాలి అంటే స్వేచ్ఛను కొన్ని శక్తులు అరికడుతున్నాయి. స్త్రీ స్వేచ్ఛను కుదించే అంశాలు సామాజికం, ఆర్థికం, రాజకీయం, సాంస్కృతికం, మానసికం, లైంగికం వీటిని తొలగిస్తే తప్ప స్త్రీల లైంగిక స్వేచ్ఛ ఆచరణలోకి రాదు.

స్త్రీ కొంతకాలం పురుషుని వస్తువుగాను, మరికొంతకాలం అతని బానిసగాను, తరువాత యీనాడు రెండవ తరగతి పౌరురాలుగాను బ్రతుకుతున్నది. ఆ జీవితాన్ని ఆమె కోరి తెచ్చుకొనలేదు. పురుషుడు ఆమెకు ఈ స్థితిని కల్పించాడు. ఇంతకాలంగా దాస్య జీవితం గడుపుతున్న స్త్రీ న్యూనతా భావానికి లోనయింది. పురుష ప్రాధాన్య సమాజపు విలువలను తమవిగా చేసుకుంది. దాంతో తను తక్కువ మనిషినని భావించ నారంభించింది. ఇది ఆమె స్వేచ్ఛకు అడ్డుగాఉన్న మానసిక ప్రతిబంధకం.

కుటుంబంలో, సమాజంలో పురుషులు స్త్రీలను వేరు చేశారు. వారికి ఇల్లే 'స్వర్గమని' బోధించారు. వారి మనః కవాటాలను బంధించడంతో తృప్తిపడక సామాజికాచారాల పేరుతో, సంప్రదాయాల సంకెళ్ళలో వారిని కట్టిపడవేశారు. వారిని విద్యా సంస్కృతులకు దూరం చేశారు. సహజంగా వారి దృష్టి హ్రస్వమయింది, వారి దృక్పథం సంకుచితమయింది. రాజకీయాధికారాన్ని పురుషులు తమ గుప్పిట్లో ఉంచుకున్నారు. హింసా సాధనాలైన న్యాయస్థానాలు, బందిఖానాలు, రక్షకభట శ్రేణి, సైన్యం పురుషుల గుత్త సంస్థలయినాయి, తత్ఫలితంగా మహిళలకూ మహిళోద్యమాలకు అవరోధాలు అనేకం ఏర్పడ్డాయి.

స్త్రీలు కష్టజీవులు. ఇంటా, బయటా పని చేస్తున్నారు కాని వారి ఇంటి పనికి విలువలేదు. వారు కుటుంబం వెలుపల పనిచేసి సంపాదిస్తే ఆ వరుమానంపై వారికి హక్కులేదు. తండ్రులు, భర్తలు, తనయులు, సోదరులు దానిని కాజేస్తారు. సంపాదనపరురాలయిన స్త్రీ కూడ అస్వతంత్రగా జీవించవలసిన పరిస్థితి ఇది.

స్త్రీల లైంగిక స్వేచ్ఛను గురించి మాట్లాడేముందు స్త్రీలపై జరిగే లైంగిక దౌర్జన్యం విషయం గమనించటం న్యాయం. కుటుంబంలో ఆమె లైంగిక దౌర్జన్యానికి లోనవుతున్నది. దగ్గర బంధువులయిన మేనమామలు, మేనత్త కుమారులు చివరకు కొన్ని సందర్భాలలో తండ్రులు కూడా ఆమెపై లైంగిక దౌర్జన్యం సాగిస్తున్న కేసులున్నాయి. వైవాహిక జీవితంలో భర్తల సంగతి సరే సరి. ఆమె ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా అతగాడు ఆమె పొందును కోరవచ్చు; అనుభవించ

వచ్చు. వివాహ వ్యవస్థలో జరిగే మానభంగాల విషయంగా నేరారోపణ చేయటానికి వీలులేదు. వివాహానికి అంగీకరించినందువల్ల స్త్రీ తన భర్తకు అలాంటి చర్యలకు గడంగటానికి 'లైసెన్సు' ఇచ్చిందట ! ఎంత చక్కని ధర్మసూత్రం ; ఎంత అన్యాయం ? ఇక స్త్రీల లైంగిక స్వేచ్ఛను పెంచే అంశాలను గురించి ఆలోచిద్దాం. స్వేచ్ఛ మనగల్గటానికి అనుకూలమయిన వాతావరణం కావాలి. సానుకూలత చేకూర్చే కొన్ని పరిస్థితులు నెలకొనాలి. కనుక వాటిని పేర్కొనటం అవశ్యకర్తవ్యం. మానసికంగా ఎలా స్వేచ్ఛను పొందగలదు ? అంటే స్త్రీలలో న్యూనతా భావం పోవాలి. సాంస్కృతికంగా స్వేచ్ఛను సాధించటం ఎలా అని అలోచిస్తే పురుష ప్రాధాన్య సమాజపు విలువలు నశించి, సమతా సమాజపు విలువలు చోటుచేసుకోవాలి.

సామాజికపరంగా ఆలోచిస్తే స్త్రీల వేర్పాటు, పరదాలాంటి పద్ధతులు పోవాలి. విద్యా సంస్కృతులు స్త్రీలకు అందుబాటులోకి రావాలి. సామాజిక వ్యవహారాలలో పురుషులతోపాటు స్త్రీలకు సమానహోదా కలగాలి. అన్నింటా ద్వంద్వనీతి సమసిపోవాలి. ఆరోగ్యరక్షణ, పోషణా సౌకర్యం కావాలి, లైంగిక విద్య బాలబాలికలకు అందజేయాలి. కన్యాత్వం యెడ నిరసన భావ నిర్మూలన, వితంతు వివాహం పట్ల అనుకూల్యత, విడాకులు పొందిన స్త్రీపట్ల సమాదరణ జరగాలి. క్రమ సంతానం అక్రమ సంతానం అనే వివక్షకు తావు లేకుండా బాల బాలికలను జాతి సంపదగా పరిగణించి పెంచాలి. జన్మనిగ్రహసాధనాలు, గర్భస్రావం లాంటి సౌకర్యాలు అందరు స్త్రీలకు అందుబాటులో ఉండాలి. తల్లులుగా మానవజాతి మనుగడను పెంపొందించే స్త్రీలకు అవసరమైన అదనపు సౌకర్యాలను కల్గించాలి. కుటుంబపరంగా స్త్రీ లైంగిక స్వేచ్ఛకు భర్తలు భార్యలపై చేసే లైంగిక దౌర్జన్యం ఆగాలి. ఇంటి పనిలో ఇరువురూ పాలుపంచుకోవాలి. పిల్లల పెంపకం తల్లిదండ్రులిద్దరి బాధ్యతగా భావించి ఆచరించాలి. జీవిత భాగస్వాములు సమానులు అనే భావం సర్వే సర్వత్రా వెల్లివిరియాలి. ఆర్థికం అన్నింటికన్నా ముఖ్యమైన అంశం కనుక ఇందులో స్త్రీలు తమకు నచ్చిన వృత్తిని దేనినయినా చేపట్టటానికి అవకాశం ఉండాలి. ఉద్యోగ నియామకంలో, శిక్షణలో, ప్రమోషనులో, స్త్రీలయెడ వివక్ష నశించాలి. స్త్రీలకు పురుషులకు సమాన నైపుణ్యం కల పనికి, సమాన కాలంలో చేసే పనికి సమాన వేతనం ఇవ్వాలి. ఇది ప్రభుత్వ కార్యాలయాలకు, కర్మాగారాలకు, ప్రభుత్వ సంస్థలకు, వ్యక్తిగత వ్యాపార పరిశ్రమలకు ఇంకా తదితరాలకు అన్నింటికి వర్తించాలి. స్త్రీల సంపాదన పైన పెత్తనం, యాజమాన్యం ఆమెదే.

మరెవరికి అధికారం లేదు. వారికి జీవన భద్రత, సామాజిక భద్రత ఒనగూడాలి. మానసిక బంధాలనుండి విముక్తి పొందిన మహిళ మాత్రమే లైంగిక స్వేచ్ఛను ఊహించగలదు. ఆర్థికంగా తన కాళ్ళపై తను నిలబడగల వ్యక్తి మాత్రమే లైంగిక స్వేచ్ఛను ఆశించగలదు. సామాజిక సృంఖలాలను ఛేదించిన స్త్రీ మాత్రమే లైంగిక స్వేచ్ఛను సిద్ధించుకోగలదు. రాజకీయాధికారాన్ని చేజిక్కించుకోగల వనితలు మాత్రమే లైంగిక స్వేచ్ఛను స్థిరీకరించుకోగలరు.

పై మార్పులన్నీ ఒక ఎత్తు స్త్రీల లైంగిక స్వేచ్ఛకు అడ్డుగా నిలిచే భావజాల విధ్వంసం మరో ఎత్తు. పైన పేర్కొనబడినవి ప్రాథమిక చర్యలను సూచిస్తాయి. అంత మాత్రాన అవి మాత్రమే సరిపోతాయని తలపోయడం తప్పు. ఇంకా కొన్ని పరిస్థితులను కల్పించుకోవటం అవసరం.

స్త్రీలు విడనాడవలసిన భావాలు కొన్ని వున్నాయి. అవి సామాజిక కార్య కలాపాల్లో పశుబలానికి ప్రాధాన్యత వుండటం, పురుషులు సబలులు, స్త్రీలు అబల లుగా చెలామణికావటం, లైంగిక రంగంలో కూడ పురుషులదే ఆధిక్యత అవటం, ప్రకృతి కూడా పురుషాధిక్యతను బలపరుస్తుండడం వల్ల స్త్రీ పురుష ప్రకృతులు వేరు వేరు కావటంలాంటి విషయాలు గురించి వున్న నమ్మకాలు, పాత భావాలను విడనాడితే తప్ప స్త్రీలకు స్వేచ్ఛలేదు. స్త్రీలు గుర్తు పెట్టుకోవలసిన అంశాలు గురించి కూడా చెప్పక తప్పదు. బుద్ధిబలానికి ప్రాముఖ్యత ఉన్న సమాజం మనది. ఇది కంప్యూటరు యుగం; రాబోటులకాలం, స్త్రీలకు వ్యాధినిరోధక శక్తి పురుషుల కన్నా పదిశాతం ఎక్కువ. స్త్రీ మాత్రమే గర్భం ధరించగలదు. ఇటీవల వచ్చిన శాస్త్ర పరిశోధనా జ్ఞానంవల్ల పురుష సంపర్కం లేకుండా స్త్రీ గర్భవతి కాగలదు. సంతానం కోసం స్త్రీ పురుషనితో దాంపత్యజీవితం గడుపనవసరంలేదు. స్త్రీల లైంగికతపై జరిగిన ఆధునిక పరిశోధనవల్ల తేలిందేమంటే ఆమె లైంగిక తృప్తికి పురుషని సాయం అవసరంలేదు. దాని తాలూకు ప్రక్రియలు ఆమెకు అందుబాటులోకి వచ్చాయి. ప్రకృతి ప్రసాదించిన శక్తులమూలంగా స్త్రీ జీవితకాలం పురుషని జీవితకాలం కన్నా ఎక్కువని తేలింది. స్త్రీ ప్రకృతి అని పురుష ప్రకృతి అని వేరువేరుగా లేవు. స్త్రీలో ఆ రెండు ప్రకృతులు ఉంటాయి. అలాగే పురుషు లలో కూడా ఆ రెండు ప్రకృతులు ఉంటాయి. కాకపోతే పురుషాధిపత్య సమాజ ములో పురుషులలో పురుష ప్రవృత్తి విశేషంగా పెరిగింది. సమ సమాజంలో ఆ

వ్యత్యాసం నశిస్తుంది. వ్యక్తులు వారి లింగభేదాన్నిబట్టికాక, వారి నైజాలను, పరిస్థితులను బట్టి ఆయా ప్రకృతులను పెంచుకుంటారు.

**జీవితకాలపు పెరుగుదల ;** ముందు రాబోయే సమాజంలో స్త్రీ పురుషుల జీవిత పరిమితి పెరుగుతుంది. మనదేశంలో 1940లో మనిషి సగటు జీవితకాలం 23 సంవత్సరాలు. ఈనాడు 58 సంవత్సరాలు. అమెరికాలాంటి దేశాలలో సగటు జీవితకాలం 76 సంవత్సరాలు. క్రీ. శ. 2020 నాటికి అమెరికాదేశపు మనిషి 140 సంవత్సరాలు జీవించగల్గుతాడని వారి అంచనా. ఈ పెరుగుదలవల్ల కుటుంబ జీవితంలో, సామాజిక జీవితంలో అనేకమయిన మార్పులు తప్పక వస్తాయి. ఇన్ని సంవత్సరాలు జీవించే పురుషుడు కాని స్త్రీ కాని ఒకే వృత్తిలో ముప్పది నలుబది ఏండ్లు పనిచేయటానికి ఇచ్చగించరు. కనీసం 3, 4 సార్లు తన వృత్తులను మారుస్తాడు. వృత్తితోపాటు అతనికి ఉండే ఆసక్తికర విషయాలూ మారతాయి. ఆసక్తికర విషయాలు మారితే వాటిలో ఇష్టం ఉన్న వారితో సాంగత్యం నెరప ఇచ్చగిస్తాడు పురుషుడు. స్త్రీ కూడా ఇలాగే వ్యవహరిస్తుంది. అంటే మొదట్లో వివాహమాడిన స్త్రీతో పురుషుడు, అలాగే ప్రథమంగా పెండ్లాడిన పురుషునితో స్త్రీ జీవితాంతంవరకు వైవాహిక జీవితం గడపటానికి వారు ఇష్టపడరు. విడాకులు, పునర్వివాహాలు, లేక దాంపత్యాలు లేక ఒంటరిగా జీవించటాలు పెరుగుతాయి. ఈ పరిస్థితులలో స్త్రీల లైంగికస్వేచ్ఛ విస్తరిస్తుందా ? లేక సంకుచితమవుతుందా ? అంటే విశాల ప్రాతిపదికపై వారి లైంగిక స్వేచ్ఛ మనగల్గుతుందని తేలుతుంది.

సంతానప్రాప్తి సంబంధమైన సాంకేతిక ప్రగతిని విశ్లేషిద్దాం. సంతానం పొందటం విషయంగా క్రొంగొత్త పరిశోధనలమూలంగా భవిష్యత్తులో చాలమార్పులు వస్తాయి. పురుషేంద్రియాన్ని కొనుగోలు చేసుకొన్న స్త్రీ ఏ పురుష సంపర్కం లేకుండా గర్భవతి కావచ్చు. భర్త ఇంద్రియంద్వారా పరాయి స్త్రీ గర్భవతి అయితే ఆ గర్భాన్ని తన గర్భాశయంలోకి మార్పించుకోవచ్చును. భర్త ఇంద్రియాన్ని తన అండాన్ని బయట టెస్టుట్యూబ్‌లో కలిపి దానిని తన గర్భాశయంలో చేర్చుకోవచ్చును. అలాకాక పర పురుషుని ఇంద్రియాన్ని కాని తన అండంతో కలిపి కృత్రిమ గర్భంలో నవమాసాలు పెంచవచ్చును. అప్పుడు స్త్రీకి గర్భధారణ భారం తప్పిపోతుంది.

ఈ ప్రయోగాలు సామాన్యులకు అందుబాటులోకి వస్తే సంతానం కోసం

పురుషసాంగత్యం కోరవలసిన పరిస్థితి స్త్రీలకు తప్పిపోతుంది. దాంతో వారి లైంగికత వికాసానికి వీలు ఏర్పడుతుంది. పురుషులు ఈనాడు ఆమెపై విధించిన ఆంక్షలు బదాబదలు అవుతాయి.

## స్త్రీ శారీరక శాస్త్ర విజ్ఞానం

స్త్రీల లైంగికతకు సంబంధించిన అవయవాలను గురించిన జ్ఞానం పెరిగింది. స్త్రీకి లైంగిక తృప్తినిచ్చే శారీరక భాగాల ప్రాధాన్యత విషయంతో మార్పువచ్చింది. స్త్రీపురుష మర్మావయ సంయోగము మాత్రమే స్త్రీల లైంగిక వాంఛా ఫలసిద్ధికి మార్గ మనే ఊహ ఎగిరిపోయింది. స్త్రీ తనంతట తానుగా లైంగిక తృప్తిని పొందటానికి అనువైన విషయ పరిజ్ఞానం ఆమెకు అందింది. దీంతో స్త్రీ లైంగికత సార్థకమవటా నికి పురుషుని సాయం అవసరం లేకపోతున్నది. ఇది చాల విప్లవాత్మకమైన మార్పు స్త్రీకి ఇది 'వర' ప్రసాదం. పురుషాధిపత్య పరిస్థితినుండి ఆమెకు విముక్తి తప్పని సరిగా లభిస్తుంది. ఆమె తనకు నచ్చిన మరో స్త్రీతో కాపురం చేయటానికి అవకాశం ఆమెకు లభిస్తున్నది. దీంతో లైంగికతకు సంబంధించిన విలువలు గుణాత్మకంగా మారతాయి. జన్మ నిగ్రహసాధనాల వ్యాప్తివల్ల దాంపత్య జీవితం సంతాన ప్రాప్తికి దారి తీస్తుందనే భయం మటుమాయమయింది. సాంకేతిక విజ్ఞానపు పెరుగుదలవల్ల సంతాన ప్రాప్తికి దాంపత్య జీవితానికి గల సంబంధం పూర్తిగా తెగిపోయింది. శారీరక శాస్త్ర విజ్ఞాన ఫలితంగా స్త్రీకి పురుష సాంగత్యపు అవసరం తీరిపోయింది.

ఇటువంటి కాలంలో అసలు లైంగికతే అర్థం కోల్పోతుంది. స్త్రీపురుషులు లైంగికత కన్న సన్నిహితత్వానికి (INTIMACY) ప్రాముఖ్యత ఇస్తారు. అపుడు లైంగికతను గురించిన అపోహలు, స్త్రీల లైంగికతపై ఆంక్షలు, తత్ఫల సిద్ధికి అభ్యంతరాలు ఆటంకాలు సమసిపోతాయి. బహుశః అపుడు స్త్రీల లైంగిక తను గురించి ఉపన్యాసాలు, వ్యాసాలు, చర్చలు, గోష్ఠులు, పరిశోధనలు అనవసర మవుతాయి.

మహిళా వికాసానికి

# మల్లాది సుబ్బమ్మ సాహిత్యం

| | | |
|---|---|---|
| చరిత్ర | 1. ఆం. ప్ర. మహిళోద్యమం (1860–1983) రు. | 25–00 |
| విమర్శనాత్మక | 2. హైందవం : స్త్రీలు | 25–00 |
| గ్రంథాలు | 3. ఇస్లాం : స్త్రీలు | 15–00 |
| | 4. క్రైస్తవం : స్త్రీలు | 12–00 |
| వ్యాస సంపుటాలు | 5. సమస్యలు . సంస్కరణలు | 25–00 |
| | 6. మహిళా దశాబ్దం | 7–50 |
| | 7. స్త్రీ విమోచన | 7–50 |
| | 8. ఓ మహిళా! ముందుకు సాగిపో | 7–00 |
| | 9. వనితాలోకం | 12–00 |
| | 10. మనం ; మన సంస్కృతి | 12–00 |
| | 11. బానిసా కాదు, దేవతా కాదు | 10–00 |
| | 12. స్త్రీలపై అత్యాచారాలు | 7–00 |
| | 13. స్త్రీల హక్కులు ; సమస్యలు | 6–00 |
| | 14. మత ధర్మశాసనాలు ; మహిళలు | 8–00 |
| | 15. బంగారు సంకెళ్ళు | 10–00 |
| | 16. హేతువాదం ; స్త్రీలు | 5–00 |
| | 17. **ATROCITIES ON WOMEN** | 30–00 |
| | 18. **SAGA OF WOMEN'S STRUGGLE** | 10–00 |
| సంకలనాలు | 19. వివాహం : నేడు, రేపు | 20–00 |
| | 20. మహిళా వికాసం ; శ్రమ, ఉద్యోగం | 15–00 |
| | 21. వివాహం సంతానం కోసమేనా? | 10–00 |
| | 22. వరకట్న విశ్లేషణ | 10–00 |
| | 23. అశ్లీలం : అసభ్యత | 15–00 |
| నవలలు | 24. వంశాంకురం | 20–00 |
| | 25. ప్రేమ+సెక్స్ = నీతి | 17–00 |
| | 26. వెలిగిన జ్యోతి | 12–00 |
| | 27. కాంతి కిరణాలు | 12–00 |
| | 28. చీకటి వెలుగులు | 10–00 |
| | 29. ఈ దేశం నాదేనా? | 5–00 |
| కథలు | 30. మాతృత్వానికి మరోముడి | 20–00 |
| ప్రణాళిక | 31. స్త్రీ విముక్తి | 6–00 |
| **CRITIQUE** | 32. **ISLAM&WOMEN** | 120–00 |
| **ESSAYS** | 33. **WOMEN TRADITION & CULTURE** | 70–00 |

వికాసం, 9 ఎం.ఐ.జి. హెచ్, మెహిదీపట్నం, హైదరాబాద్–28, ఫోను : 35429